శ్రీ రా మ సే వ

ఆపదా మపహర్తారం దాతారం సర్వసంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమా మ్యహమ్.

ఆ ర్య చ రి త్ర ర త్నా వ ళి

# స తీ హి త చ ర్య

శ్రీ మదాంధ్ర వాల్మీకి, వాసుదాసు
వావిలికొలను సుబ్బరాయ విరచితము



సప్తమ కూర్పు – 10000

ప్ర కా శ కు లు.

శ్రీ కో ద ం డ రా మ భ క్త సే వా స మి తి
శ్రీరామసేవాకుటీరము
ఒంటిమిట్ట, కడపజిల్లా.

శ్రీరామాయ నమః

## ఆ ర్య చ రి త్ర ర త్నా వ ళి

# స తీ హి త చ ర్య

తండ్రి– ఏమమ్మా ! రుక్మిణమ్మా ! నీవు మహాలక్ష్మమ్మ యేదో పనియుండి యిచ్చటికి వచ్చినట్టు నాకుఁ దోఁచుచున్నదే.

రుక్మిణమ్మ– అవును, మాకొక ధర్మసందేహము కలిగినది. అది నీవలన నివర్తించుకొనఁగోరి వచ్చితిమి. సీతాదేవి, సావిత్రిదేవి, చంద్రమతి, దమయంతి, ద్రౌపది వీ రంతటి శక్తిగలవార లెట్లయిరి ? కావలయుననిన వారివలె నిప్పటివారు కాఁగలరా ? ఇదే మా సందేహము.

తండ్రి– మేలు బిడ్డలారా ! మేలు. మీ యోగ్యతకుఁ దగిన ప్రశ్నమే యడిగితిరి. సవిస్తరముగఁ ప్రత్యుత్త రమిచ్చెదను. ఈ కుర్చీలపైఁ గూర్చుండుఁడు. ఎంతసేపని నిలువఁగలరు ?

రుక్మిణి– అప్పా ! అనసూయాదేవియొద్దకు సీతాదేవి పోయినపుడు ఆ తపస్విని పెద్దపీఁట వేసి కూర్చుం డుమని నియోగించెను. అప్పుడు సీతాదేవి దానిని జేతితో నంటి నిలువఁబడెను. దానిపైఁ గూర్చుండలేదు. అనసూయ యేల కూర్చుండవని యడుగ సీతాదేవి వినయముతో “మహానుభావులారా ! నీవు వృద్ధురాలవు, తపస్వినివి. మహా పతివ్రతవు. ఇట్టి నీవు క్రిందఁగూర్చుండియుండ నేను ఉన్నతపీఠమునఁ గూర్చుండుట తగునా ?” అనెనఁట. అప్పు డనసూయాదేవి “కూఁతురా ! నీవు మహారాజకుమారివి. సుకుమారివి. మఱియొక మహారాజు కోడలివి. మహాను భావుని భార్యవు. ఇట్టి నీవు నీ పరువునకుఁ దగినస్థానమునఁ గూర్చుండుట తగునుగాని బీదవారివలె గ్రిందఁ గూర్చుండుట గౌరవమునకు హాని. ప్రతిమనుష్యుఁడు వాని వాని పరువు గుర్తెఱిగిఁ దానిని గాపాడుకొనుచుఁ బ్రవర్తింపవలయును. పరువునకుఁ దగని కార్యము చేయరాదు సమా” యని చెప్పెను. “తల్లీ ! రాజకుమారిని కాగానే పిన్న పెద్ద తారతమ్యము పాటింపఁ బనిలేదా ? మట్టుమర్యాద కలిగి ప్రవర్తింపరాదా ? పెద్దవారితో సమానముగఁ జిన్న వారు కూర్చుండరాదు అందు నున్నతస్థానము లందు కూర్చుండనేరాదు. దోషము కూర్చుండు కార్యము నందు లేదు. భావమునందుఁ గలదు. పూజ్యు లున్నత స్థానమునఁ గూర్చుండవలయును. పూజించువారు గ్రిందకూర్చుండవలయును. అధికారమునుబట్టి, ధనమునుబట్టి సంపాదించు పూజ్యతకంటె వయస్సునుబట్టి, విద్య నుబట్టి సంపాదించు పూజ్యత గొప్పది. ఆ రెంటికంటెను గుణమహిమను బట్టి జ్ఞానమహిమనుబట్టి సంపాదించు గౌరవము మిగులగొప్పది. ఎట్టివారికిని వినయమే భూషణము. అహంకారమున్న చోటను, అజ్ఞానమున్న చోటను, వినయముండదు. అవి రెండును మిగుల ననర్థకములని మా తల్లి గారు చెప్పిరి. నీవు వయస్సు చేతను, పాతివ్రత్య మహిమ చేతను, జ్ఞానముచేతను, బూజ్యరాలవు. నీతో సమానముగ నేను గూర్చుండిన నీ కే నష్టియులేదు. నాకే నష్టి” అనిన ననసూయ యిట్లనియె “బిడ్డా ! నీ మాటలకు మిక్కిలి సంతోషించితిని. నీవు చెప్పిన దితరులు క్రొత్త వారుగా నుండువారి విషయముగాని తల్లిబిడ్డల విషయముగాదు. తల్లి యొద్ద బిడ్డ యెట్లుండిన నేమి ?” అనెను. సీతాదేవియును “బిడ్డ కడుపులో నున్నపుడు తల్లిని గాలిచేఁ దన్నును. పుట్టిన పిమ్మట తన్నెత్తుకొను తల్లిదండ్రులను బెద్దవారిని కాలఁదన్నును అట్లని వయస్సువచ్చి తాఁకు తప్పు తెలిసిన పిమ్మటఁగూడఁ దన్నవ చ్చునా ? అజ్ఞానదశయం దేమిచేసినను దోషము లేదు. తెలివి తెలిసిన పిమ్మట నటుచేసిన దోషము వచ్చును. ముందు నేను జెప్పిన గుణము లేవియు లేకుండిననుగూడఁ దల్లిదండ్రులు గురువులు పూజ్యులు. కావునఁ దల్లిదండ్రుల యెదుట గురువుల యెదుట చిన్నవాండ్రు వినయము దప్పి వర్తింపరాదు” అని చెప్పెను. అప్పు డనసూయ సంతోషించి “కూఁతురా ! నీవు జనకునకుఁ దగిన కూఁతురవు శ్రీరామచంద్రునకుఁ దగిన భార్యవు. నీ గుణము నాకుఁ దెలియక నిన్నెత్తుపీఁటపై గూర్చుండు మనినదానను గాను. నీ మనస్సు పరీక్షించుటకును, నీ మనస్సు వినయమున స్థిరపఱుచుటకు నే నట్లు చెప్పితిని. స్త్రీలకు వినయమువంటి భూషణములేదు” అనిచెప్పి కృష్ణాజినమిచ్చి యందుఁ కూర్చుండుమనిన సీతాదేవి గూర్చుండెనని ముందు నీవే నాకుకఁ జెప్పియుంటివే. అప్పు డు చిన్నదానను గావున నెట్లుండినఁ జెల్లిపోయెను. ఇప్పుడు ప్రాయము వచ్చినవారము. మే మట్లు కూర్చుండవ చ్చునా ? అంతేకాదు వంకాయను వంకాయకు వచ్చిన యలవాటే టెంకాయకు వచ్చును. ఈ యలవాటే పరస్థ ములందును వచ్చును. అట్టి యభ్యాసము మంచిది కాదుకదా ?

తండ్రి– బిడ్డలారా ! చాలా సంతోషించితిని. అటైన నీచాంపపైం గూర్చుండుండు. సీతయు, సావిత్రియు మొదలైన పుణ్యస్త్రీ లెట్లంతటి మహిమగలవారైరి యని తెలిసికొనంగలిగిన కోరికవలననే మీరు బాగుపడంగలరు. ఆ ప్రకారము మీరును వర్తించితిరా బాగుపడుటయందు సందేహములేదు. ప్రతి మనుష్యునకు స్త్రీకిఁగాని పురుషునకుఁ గాని గొప్పవా రొకరు గుఱియందుండి వారివలె మనము ప్రవర్తింపవలయును అంతటివారము మనము కావలయునని బలమైన కోరిక యుండవలయును. కోరిక బలముకొలఁది ఫలము కలుగును. కోరికయే యీ గొప్పవారు చెప్పినట్టి కార్యములఁ జేయఁ బ్రేరించును. అట్టి కార్యములు చేయుటవలన నట్టివాఁడే యగును. భక్తుడు చేయుకార్యమేమి ? భగవంతునియందు వాత్సల్యము సౌశీల్యము దయ ప్రేమలోనైన సద్గుణము లున్న వని యెఱిఁగి యాగుణములను దానును సంపాదింప యత్నించును. అన్ని గుణములు సంపాదించినవాఁ డంతటివాఁడగును. ఒకపూఁట నొకపూట నొకయేఁట నొకపుట్టువున సాధ్యము కానీ కాకపోనీ యుత్కృష్టపదార్థ మునే యిష్టపదార్థముగ నుంచుకొని దృష్టి దానియందే యుంచి ప్రవర్తింపవలయును. ఎత్తు కొమ్మనునుండు ఫలమును రాల్పఁ బ్రయత్నించి రాల ఱువ్వువాఁడేనాఁడో యొకనాఁడు దానిని బొందఁగలుగును. అటు ప్రయత్నిం పనివాని కా ఫలములేదు. తనకంటె నీచమైన దానియందు దృష్టియుంచువాఁడు దానివలెనే యగును. కావున మీకిష్టదైవముగ నొకదానిని నేర్పఱచు కొనిదానియందె మనస్సునిలిపి దానియందు లోపము లెవరైన జెప్పినను వినక దానికంటె గొప్పది మఱి యొకటియున్నదని చెప్పినను మనస్సునఁ బెట్టకయుండవలయును. కావుననే మీరడిగిన ప్రశ్నము మేలైనదని ప్రశంసించితిని. ప్రత్యుత్తరమును జెప్పెదను. బాగుపడవలయు నని సంకల్పముండిన మీ రాప్రకారము ప్రవర్తింపవలయును. సంకల్పము, దృఢమైనచో సాధ్యముగాని దేలోకమున లేదు. సంకల్పము చేతనే భగవంతుఁడు ప్రపంచము సృష్టించెను. కావునఁ దొలుత మీకు బాగుపడవలయు నను దృఢసంకల్ప మొకటి యుండవలయును. అది యుండిన నన్నియు సాధ్యములే. అది లేకపోయిన నెన్నియుండినను వ్యర్థములే. సం ల్పము దృఢమైనయెడలఁ గొంతకుఁ గొంతయైన బాగుపడుట సత్యము. సీత, సావిత్రి లోనైన వారు గొప్పవారగు టకు మొదటి కారణము తల్లిదండ్రులు గొప్పవారగుట. రెండవకారణము తల్లిదండ్రుల శిక్షమూఁడవది స్వభావము, శిక్షయనఁగా కొట్టుట తిట్టుట గాదు. ఈ విషయమున నీ విట్లు ప్రవర్తింపవలయు నని నేర్పి యాప్రకారము వారు ప్రవర్తించునట్లు చేయుట ఈ మూఁడు కారణములచేతను వారంతటి గొప్పవారైరి.

రుక్మి– అట్లయిన వీరికిఁ గలిగినంత మహిమ వీరి తల్లిదండ్రులకేల కలుగలేదు ?

తండ్రి– సారవంతమైన విత్తనమును సారవంతమైన నేలలోఁ బాఁతిపెట్టితివా పుట్టెడిచెట్టు తల్లి చెట్టునకంటె ను సారవంతమైనది ఫలవంతమైనది యగునుగదా. నిస్సారమైన విత్తనము నిస్సారమైన నేలలో నాటిన తల్లి చెట్టునకంటె నిస్సారమైన చెట్టు పుట్టును. విత్తనము సారవంతమైనను నేల సారవంతము కా దేనియు పూర్ణఫలము రానేరదు. అట్టులే తల్లి యందుండునట్టియు దండ్రియందుండునట్టియుసారమును గ్రహించి పుట్టునది బిడ్డ, తల్లి దండ్రు లిరువురు గొప్పవారైరా వా రిరువురికంటె బిడ్డ గొప్పదగును. తల్లిదండ్రు లిరువురు నీచులైరా వారిబిడ్డ వారి యిరువుర కంటె నీచమగును. ఉత్తమాధమ సంయోగమువలన ఫలము కొఱఁత వడును. ఇది స్వభావధర్మము తల్లిదండ్రులకంటె బిడ్డలు గొప్పవారగుటకు నీచు లగుటకు నిదే కారణము, జారిణీ జారులందును మహాపురుష లుదయింతురను వాదము నేఁడు వినుచున్నానుగాని గొప్పవా రెన్నఁటికి నీ చగుణులం దుదయింపరు. ఇదివఱ క ట్లుదయించినదిలేదు. ఇఁక బ్రకృతియే మాఱునేమో నాకుఁ దెలియదు. దైవనిధి యనివార్యమనియే నా తలంపు. మీరు మీ భర్తలు మంచి గుణములు గలవారైనయెడలఁ బ్రారబ్ధ మడ్డపడ దేని మీ బిడ్డలు మీకంటెను గొప్పవారు కావలయును.

మహలక్ష్మమ్మ– కక్కా ! నీవు చెప్పినదే నిజమైనయెడల బూర్వకాలమున మనదేశములో నెందఱో గొప్ప వారుండిరిగదా. క్రమక్రమముగ నభివృద్ధిచెంది యిప్పుడెందఱో యీ దేశమున గొప్పవారుండుటకు మాఱుగ నీ దేశమే యనాథాల యముగా నున్నదే యేల ?

తండ్రి– అమ్మా ! కారణములేక కార్యము గలుగదు. మహాభారతయుద్ధములోఁ బదునెనిమిది యక్షౌహిణు లసేన పదునెనిమిది దినములలోఁ జచ్చెను అనగా రథమునకు నలువురు, ఏనుగున కిద్దరు, గుఱ్ఱమున కొకరు ఈ ప్రకారము లెక్క వేసినను 24494400 యోధులు చచ్చిరి. ఇంతే కాదు. ఒక్కొక్క తేరికి ముప్వురు నలువురు చక్రరక్షకులుండుట కలదు. ఒక్కొక్క యోధునకు నొక్కతకు మించి యనఁగా 2–3 గురు భార్య లుండుటయు గలదు. ఈ లెక్కప్రకారము చూచిన నధమపక్షమున భారతయుద్ధములో 3 కోట్ల విధవలు 18 దినములలో

సృష్టింపబడిరి. ఇంతేకాదు ధర్మరాజు అశ్వమేధయాగము చేసినపుడును గొందఱు చచ్చిరి. రెండుయుద్ధములందును, యోధులేగాక వారి పరిచారకులు యుద్ధసంభారవాహకు లె ం ద ఱు చచ్చిరో, ఈవిధముగ నొక సంవత్సరము లోపల నా లు గు కో ట్ల ప్రాయపుస్త్రీలు విధవలై రనుట యతిశయోక్తిగా నుండదు. యాదవ ప్రళయమున మగ పురుగు బ్రతుక దాయె గదా ? వీరిభార్య లేగతిఁ బుట్టిరి ? వీరందఱు కామమును జయించినవారా ? కాకుం డిన వారి నడవడి యెట్టిదైయుండునో యాలోచింపుడు. వయస్సు వచ్చినట్టి మగవారిని గామశాస్త్ర పండితలైన యీ విధవలే కులుకులఁ దళుకుల బెళుకుల జిలిబిలి పలుకుల వశులఁ జేసికొనుచుండ నికకన్యలకుఁ దగినవరు లెందుండివత్తురు ? ముండల పెండ్లిండ్లు నిషేదించుట కిది యొక కారణము. సాధారణముగఁ కన్యక లెక్కువగ నున్నారు. స్త్రీలు మగవారు పుట్టుట సమానమైనను మగబిడ్డ లెక్కువగఁ జిత్తురు. ముండలను బెండ్లి చేసికొనిన యెడలఁ కన్యకగతియేమి ? వీరు పెండ్లి లేక కృశింపవలయునా ? ముండలకు మిండలు లేకుండుట చెడ్డయో కన్యకలు పతులు లేక కృశించుట చెడ్డయో మీరే యాలోచింపుఁడు. కావున నింటఁ బెద్దవారు వివాహము చేయువారు లేనప్పుడు కన్యకలు వారే రజస్వలలు కాఁగానే యేజాతివానినో యొక స్థూలకాయుని దొంగ తనముగానో బహిరంగముగానో పెండ్లి చేసికొనవలసియుండునుగదా. ఈవిధముగ విధవలు దేశమందు నుండుట వర్ణ సాంకర్యమునకు మొదటికారణము. వారిని సరియైన నీతిమార్గములో నుంచు మగవారు లేకుండుట రెండవ కారణము. పెండ్లికాని రజస్వలలు మూఁడవ కారణము. ఈవిధముగ వర్ణ సాంకర్యము ప్రారంభించి క్రమక్రమముగ బ్రబలించెను. దుష్కామము నాగజెముడు వంటిది. సత్కామము ఫలవృక్షమువంటిది. ఎప్పుడు స్వదేశ ప్రభువులు దుర్బలులయిరో యప్పుడే మహమ్మదీయులు లోనగు వారు దండెత్తివచ్చిరి. వచ్చిన పరదేశులందఱు పెండ్లాలను గూడఁ దెచ్చిరా ? లేదు. వారికిని నీ దేశపు స్త్రీలే పెండ్లాలయిరి. ఆ మహమ్మదీయులు కొందఱు హిందూస్త్రీలను వివాహమాడిరి. కొందఱ నూరకచెఱిచిరి. దూదేకులవారెవరో యెఱుగవా ? ఇప్పటి తురకలలో ననేకులు హిందూ స్త్రీల సంతతివారే. తురకులచేఁ జెడియు వారిలో గలియనిస్త్రీలు హిందువులుగ నే యుండిరి. వీరికిఁ బుట్టిన బిడ్డ లెట్టిహిందువులో నీవే యాలోచింపుము. తమ తమ జీవనములుపోయి బ్రతకుకుటే కష్టమని తోఁచిన కాలములో నీతులెక్కడ ? మత మెక్కడ ?ఆచార మెక్కడ ?కలిమి కులాలమిండఁ దనఁగా వినమా ? ఆచార మెక్కడ ? కలిమికులాలమిండఁ దనఁగా వినమా ? ఈవిధముగ క్షత్రియ స్త్రీలును, నితరయోధుల స్త్రీలును శూద్రులపాలో, తురకలపాలో, మఱియేజాతివారిపాలోయయిపోయిరి. కావుననే శుద్ధక్షత్రియులు మనదేశమునఁ గఱవైరి.

రుక్మిణి – భారతయుద్ధములోఁ జచ్చినవాఁడొక బ్రాహ్మణుఁ డేకదా ! బ్రాహ్మణులలో నేల వర్ణ సాంకర్యము కలిగెను ?

తండ్రి – ఎప్పటికైనను వర్ణ సాంకర్యమునకుఁ గారణము స్త్రీలే యనియు, దానిఫలమును భగవద్గీతయందు జదువలేదా ? అది యెట్ల నెదవా విను. అవయవముల నన్నిటిని జేతులెట్లు రక్షించుచుండునో యట్లు క్షత్రియులు తక్కిన యన్ని జాతులవారిని రక్షించుచుండిరి. అట్టి క్షత్రియులు స్త్రీపురుషులుగూడ నెప్పుడు రూపుమాసిపోయిరో యప్పుడే చేతులు లేని దేహమునందలి యవయవములవలెఁ దక్కిన వారును జెడవలసివచ్చెను. అందు ముందుగఁ జెడినవారు బ్రాహ్మణులే. వారు తమయొద్ద నేనాఁడును ధనముంచుకొనిన వారు గారు. దేహబలమును గలవారు కారు. దేశమున భూములు పుట్రలు ధనము ధాన్యము పరదేశులాక్రమించుకొనిరి. వారికి వీరియం దభిమానము లేదాయె. వైశ్యాదులు వారి బ్రదుకు వారు విచారించుటకే కష్టముగా నుండఁగా నిఁక నీ బీదబ్రాహ్మణుల విచారించువారెవరు ?కావున బ్రాహ్మణులు క్షత్రియవృత్తినో వైశ్యవృత్తినో శూద్రవృత్తినో వారివారి శక్తికొలఁది యవలంబింపవలసివచ్చెను. దేహయాత్ర ప్రధానముగఁ బాటుపడవలసిన కాలము వచ్చినపుడు నీతి మతాచారము లాత్మవిచారములు సన్నగిల్లఁజొచ్చెను. తొలుత వేఱుగతిలేక యశ్రద్ధ. తరువాత మతిలేక యశ్రద్ధ. ఆవల మఱుపు. మఱవునకుఁ దరువాత నజ్ఞానము. అజ్ఞానమువలన స్వాభిమానము లేమి. అభిమానము చెడుటచే స్వమతాదుల తిరస్కారభావము. దేహవిచార మెక్కుడగు కొలఁది నాత్మవిచార మడుగంటెను. ఇట్టి స్థితియందు సంస్కృతభాషా జ్ఞానముగూడ నశించుటచే నోరుజెప్ప మంత్రముల కర్థము తెలియమని నే కార్యమేల చేయుచున్నామో దాని ప్రయోజనమేమో తెలియక యన్ని కర్మములు నిరర్థకము లనర్థకములని తోఁచు కాలము వచ్చెను. దానివలన దేవపూజ బొమ్మలపూజయని, శ్రాద్ధములు కూటిచేటని, వివాహములు వీధులలోఁ గుక్కలో, మందలలోఁ బశు వులో, కలిసి నట్టని, సంధ్య నిష్ప్రయోజనమని, యజ్ఞోపవీతములు మృచ్ఛకటికలో దొంగబ్రాహ్మణుడు చెప్పిన వానికని, ముండల కామమణఁచుటకు వారికి మిండలను సంపాదించి యిచ్చుటే భూతదయా చిహ్నమని. యుంటు ముట్టు లింటిలోగలుపుట శౌచలక్షణమని, స్త్రీలు పరపురుషునితో స్వేచ్ఛగా సంచరింపనీయకుండుట బానిసతనము

ప్రేరేపించుటయని,కన్యావిక్రయము, నరవిక్రయము, నాగరికతయని, ముట్టుతపెండ్లిండ్లు, కానీన శరణాలయము లు, నాగరికతాభివృద్ధికి మార్గములని,పాతివ్రత్యము దాస్యమని నానావిధముల బ్రాహ్మణులే వాదించుచున్నారు. ఇంద్రియ జయమువలన బ్రాహ్మణ్యమునకు శ్రేష్ఠత్వము వచ్చినదనుట యెఱుఁగక స్వభావసంస్కారములని తమ్ము నీచులతోను, బశువులతోను బొల్చుకొనుచున్నారు.ఇట్టికాలమున స్త్రీలు దుష్కామమునకు లోపడుట యేమివింత ? ఈవికారములకు లోపడని వారిప్పటికిని బరిశుద్ధలుగానే యున్నారు.

రుక్మి– అటైన మన దేశమునకుఁ గ్రమక్రమముగ నధోగతియే కాని యూర్ధ్వగతి లేదనుము.

తండ్రి– ఆ మాట నేనను,మరలఁ గృతయుగము రాఁగలదని యాశయున్నది.

మహా– అటైన నంతవఱ కందఱు చెడవలసినవారే.

తండ్రి– నేనా మాట చెప్పను. కలియుగమున ధర్మమొకపాదము మిగులును, మూఁడు పాళ్ళధర్మ ముండును.కావునఁ బాతిక మంది మంచిగుణములుగల స్త్రీ పురుషులుందురు.ఈ పాతికవలననే దేశము మరల వృద్ధికి రావలయును.వచ్చును.

రుక్మి– ఎట్లు వచ్చును ?

తండ్రి– ఎవరివలనఁ జెడినదో వారివలననే బాగుపడును.దేశము చెడినది స్త్రీలవలననే, మరల బాగు పడవలసినది వారివలననే.పురుషుని జెఱచునది స్త్రీయే. బాగుచేయునది స్త్రీయే.కాఁబట్టి బతివ్రతయగు స్త్రీ తనను రక్షించుకొనుటేగాక తన భర్తను సంతానమునుగూడఁ బావనులఁజేయును.వాస్తవ మాలోచించిఁ బురు షుని ధర్మార్థకామములకు స్త్రీయే మూలము. కాఁబట్టి యిట్టి సాధ్వులేనాఁడు మన దేశమున విశేషించి పుట్టు దురో యానాఁడు మొదలు మన దేశము మరల నభివృద్ధికి వచ్చును.

మహా– కక్కా ! అటైన మనదేశమున సాధ్వులే లేరని నీ యభిప్రాయమా ?

తండ్రి– రామ రామ ! అది నాయభిప్రాయముగాదు.సాధ్వులింకను బెక్కురున్నారు కాని కాలకర్మవశమున వారి సంఖ్య తగ్గుచున్నదని మాత్రము చెప్పఁగలను.ఇంతకు సాధ్వియనగా ఱంకుటాలుగానిది యని నీవర్థము గ్రహించినట్టు తోచుచున్నది.జారత్వ మొకటిలేక తక్కిన దుర్గుణము లున్నయెడల నది సాధ్వియగునా ? ఇంటిలోని బియ్యము బేడలు లోనైనవి యమ్మువారును.అత్తమామాలతోను ఆఁడుబిడ్డలతోను గలహించును.గృహచ్ఛిద్రములు కలిగించు చుండులవారును, సిగ్గుబిడియము పాపభీతి లేనివారును,బావలు మఱఁదులు తోడికోడండ్రు వారి బిడ్డలు లోనగువారియందు ననాదరబుద్ధిగలవారును, పంక్తిభేదము చేయువారును, మగని వెనుకనుండి మెటికలు విఱచువారును,అడుగు పెట్టినది మొదలు కొంప రెండుగాఁ జీల్పయత్నించు వారును,సోమరులై దొంగరోగముల సాకులుచెప్పి మగనిని బానిసగాఁ జేసికొనువారును, మగనిని ధిక్కరించి మాటలాడువారును,బావిలో దూకెదము ఉరివేసికొనెదమని బెదరించువారును, మగని సుఖముకన్నఁ దమసుఖమెక్కువగఁ జూచుకొనువారును, గయ్యాళి గంగమ్మలు,మందులు పెట్టువారు, మందులు తిని కడుపులు దించుకొనువారు, అభావవిరక్తలు, నియమవ్రత హీనలు,పతియాజ్ఞమీఱి వర్తించువారు, అర్థకామాశఁ బతిని బీడించువారు,అనాచారములు దురాచారములు గలవారు, అసత్యవాదినులు, దొంగదయ్యములు పట్టినవారు, దొంగరోగములవారు, తాము దేరా గూటములవలె నుండి మగనిచేతను, ఇంటిలోని మగ వారిచేతను పండించుకొని పందులవలెఁ దిని యిల్లిల్లు తిరుగు పనిపందలు ను నగు వారలు ప్రతీపదర్శినులగుదురుగాని సుచరిత్రలు, సాధ్వులు ,సతులు,పతివ్రతలు నగుదురా ? ఏనాఁటికిని గారు.

రుక్మిణి– సుచరిత్రము, సాధ్వులు, సతులు, పవివ్రత లనఁగా నేమి యర్థము ?

తండ్రి– ఇహపరలోక సాధకములైన నడవడులు గలవారు సుచరిత్రలు.శాస్త్రీయమైన సాధువర్తనము గలవారు సాధ్వులు.ఎవరినిజూచినఁ బాపము నశించునో యట్టిపుణ్యస్త్రీలు సతులు పతిసేవయే వ్రతముగాఁగలవా

రు పతివ్రతలు. మహాలక్ష్మమ్మా ! యిప్పుడు చెప్పుము సాధ్వు లెందఱున్నారో, సీత, సావిత్రి, చంద్రమతి, దమయంతి, మదయంతి,అరుంధతి, లోపాముద్ర, అనసూయ మొదలైన స్త్రీ లిట్టివా రగుదురో కారో చెప్పుము.

మహా– అల్పసంఖ్య లున్నారనియే చెప్పవలయును.

తండ్రి– సీత, సావిత్రి మొదలైనవారివంటివారు లే కున్నారు గాని మీఁదఁజెప్పిన దుర్గుణములు లేక పతియందు భక్తిగలవారు పెక్కు రుత్తమస్త్రీలున్నారు. నే నెఱుగుదును. ఇట్టివారు సంఖ్య తగ్గిపోవుటకుఁ గన్యాజనకులే మొదటికారణము ముఖ్యకారణము, కన్యకలు పుట్టినింట నుండఁగానే వారికి గృహిణీధర్మములు,సతీధర్మములు నేర్పక "యెట్లోయత్తగారింటికిఁబోయిన నున్నది. ఇక్కడఁ గూడఁ గష్టపడవలయునా" యని మూఢలగు తల్లులు మగనియిల్లు కారాగృహమని యెంచినట్టు మాటలాడుచున్నారు. ఇట్టితల్లుల తెలివిలేని చేష్టలవలననే యాఁడబిడ్డ లత్తలయిండ్ల దుఃఖము లనుభవించుచున్నారు తల్లులు కుమార్తెలకు గృహకృత్యములు వంటలు వార్పులు పెద్ద పిన్నలయం దెవరెవరి పట్ల నెట్లెట్లు నడచుకొనవలయునో యా మర్యాదలు లోనైనవి నేర్పవలయును. ఇట్టి విషయములు నేర్పక కొఱమాలిన చదువు నేర్పుచున్నారు. కొంద ఱత్తలతో నాఁడుబిడ్డలతో గలహించుమార్గముల నేర్పుచున్నారు. కావున మరల మనవారు బాగుపడవలయుననినఁ బూర్వపుఁ బద్ధతులప్రకారము కన్యకలు శిక్షితలయిరేని పూర్వపుణ్య స్త్రీలు మరల నుత్పత్తియగుదురు. లేకపోయెనా పుణ్యస్త్రీలు దేశమున నిండుదురు,నిండు చున్నారు.

రుక్మిణి– అటైన సీతాదేవి లోనైనపతివ్రతలు పుట్టినింట శిక్షితలైన విధము తెలిపెదవా ?

తండ్రి– తెలిపెదను గాని యది లంకణములలో మనుగుడువుదలఁచుకొనుటవంటిది !

తల్లిదండ్రులు సత్యాది సద్గుణములను సదాచారములను గలిగి ప్రవర్తించుచుండుటను జూచుటే బాలురకుఁ బ్రథమ శిక్ష. చెవులకంటెను గన్నులు విషయములను శీఘ్రముగ గ్రహించును. కనులారఁ జూచినవి మనస్సునఁ జిరకాలముండును కావునఁ దొలుతఁ బెద్దవారి మాటలందున గార్యములందును హెచ్చరిక గలిగి ప్రవర్తింపవలయును. పెద్దవారునడచినట్లు నడచుట పిన్నవారికి స్వభావముగావునఁ బిన్నవారికేదేది హితమో యట్టికార్యమే వారియెదుటఁ బెద్దవారు చేయవలయును. పూర్వులు పెద్దలు సర్వదా సత్యము, పెద్దలయేడ వినయము: దైవము గురువులు వీరియందు భక్తి, శుచిత్వము,దయ లోనగు గుణములు గలిగి వర్తించుచుండిరి. కావున బాలికలును వీని నన్నిటిని దామే చూచి నేర్చుకొనుచుండిరి. వారికిఁ గొంచెము కొంచెము వయస్సు వచ్చుకొలఁది వారుచేయదగినంత పని వారిచేఁ జేయించుచు నా యా కార్యములందలి గుణదోషమును దెలుపుచు విని కని నేర్చుకొనినవి యభ్యాసపడునట్లు తల్లి దండ్రులు చేయుచుండిరి. భాగ్యవంతులు బాలికలైనను బనులుచేసి నేర్చుకొనక సోమరులుగా నుండిన వారు గారు. గృహకృత్యజ్ఞానముకంటెను బూర్వము తల్లిదండ్రులు బాలికలకు నాత్మజ్ఞానము విశేషముగఁ గలిగించుచుండిరి. దానివలన వారైహికమును లక్ష్యపెట్టక పరలోకసుఖమునకే పాటుపడుచుఁ జ క్క ని నడవడిగలవారైయుండిరి.

రుక్మిణి– అప్పా ! ఆత్మజ్ఞాన మనఁగా నేమి ?

తండ్రి– సీతా దేవిచరిత్రములో నీ కిదివరకుఁ గొంత చెప్పినాను.

మహా– కక్కా ! నాకేమియుఁ దెలియదు. నాకుఁగూడ తెలియునట్లు చెప్పుము.

తండ్రి– అటైన వినుడు. నాకుఁ జేతనైనంతమాత్రము మీకు దెలియునట్లు చెప్పెదను. బాలకహితచర్య కుమారహితచర్య, పతిహితచర్య మీరుగూడఁ జదివియుండవలయును. అప్పుడే నేను జెప్పునది మబోధమగును.

ప్రకృతియని,జీవుఁడని రెండుగలవు. ప్రకృతి స్వతంత్రచైతన్యము గలదికాదు జడపదార్థము. మనస్సు,బుద్ధి, అహంకారము,పృథివి, జలము, తేజము, వాయువు, ఆకాశము, సుఖము, దుఃఖము, ఆఁకలి, దప్పి, రాగము, ద్వేషము, సంతోషము,శోకము ఈ మొదలైనవన్నియుఁ బ్రకృతికి సంబంధించినవే. ఇవన్ని మనదేహములోఁ గలవుకదా కాఁబట్టి యీ దేహమున నుండునవి కలుగునవి సమస్తము ప్రకృతియని తెలిసికొనుఁడు. ఇట్టి దేహ

మునందు వసించువాఁడు జీవుఁడు. అతఁడు చేతనుఁడు. జననమరణములు సుఖదుఃఖములు రాగద్వేషములు,సం తోషశోకములు మొదలైన వేవియు లేనివాఁడు. దేహ మశాశ్వతము; పుట్టును పెరుఁగును, బలియును చిక్కును, మారును– నశించెను. జీవునకు నిట్టి మార్పొకటియుఁ గలుగదు. ఎల్లప్పు దేకరూపమున నుండువాఁడు. తేజస్స్వ రూపుఁడు జ్ఞానానందమయుఁడు ఈ రెంటికూడికవలననే ప్రపంచమంతయు సృష్టింపఁబడినది. మన మీసృష్టిలోఁ జేరిన వారమే కదా మనమిట్లు పుట్టుటకుఁ జచ్చుటకుఁ గారణము కుమార హితచర్యయందుఁ జెప్పితినిగదా. ఇక్క డనుండి కాశికి పోవలయునని ఉదయముకాఁగానే ప్రయాణ మారంభించి రాత్రికాఁగానే యొకచోట విశ్రమించి మరల నుదయమున నెట్లు పయనింతుమో యొక్కొక్కనాఁటి ప్రయాణమున నెట్లు కొంచెము కొంచెము కాశికి దగ్గఱ యగుదమో యట్లే పుట్టుట చచ్చుట యను నొక జన్మకాల మొకనాటి ప్రయాణము. ఈ ప్రయాణము భగవంతుని కలియుటతో ముగియును దానికే మోక్షమని పేరు. ఆవల శాశ్వతానందము అంతవఱకు నానందము లేదు. మనమానంద మనుకొనునది దుఃఖమే. ఏలంటివా ? లోకములో భాగ్యముకాని భోగము గాని బిడ్డలుగాని భార్యలుగాని యేదైన సరియ దుఃఖమును గలిగింపని సుఖమున్నదా ? లేదు. తత్కాలమున సుఖముగ,దోఁచినను గొంతకాలమున కదే దుఃఖకారణమగును. దుఃఖముతోఁ బరిణమించు సుఖము సుఖమెట్లగును ? కావున జంజాటమెట్టిదైనను దుఃఖమనియే తలంపుడు. ఈ సుఖములు దుఃఖములు రెండును ప్రయాణమునకు విఘ్నము కలిగించునవే. త్రోవ నడుచునపుడు చల్లని చెట్టునీడఁ గూర్చుండినను లేక ముండ్లు త్రొక్కి కూర్చుండినను ప్రయాణమునకు విఘ్నమేకదా కలుగును. కావున బుద్ధిమంతుఁడగు వాఁడు సుఖదుఃఖములచేత బాధింపఁబడఁ డు. ప్రయాణమున జాగుచేయఁడు. యథాశక్తి లక్ష్యమందే మనస్సుంచి శీఘ్రగమనము చేయుచుండును.

మఱియొక విషయము మీరు మనస్సున నిలుపవలయును. ఈ దేహమునందు వసించువాఁడు జీవుఁడని చెప్పితిని గదా. ఈ జీవున కీ దేహము శకటమువంటిది. బండి దేహము. బండిలోనుండువాఁడు జీవుఁడు. బండి బాగుండిననేకదా ప్రయాణము సాగును. కావున బండిని మంచిస్థితియందుంచుకొనుట ప్రథమ కర్తవ్యము. అటుగాక బండిని విఱుగఁజూచెనా మరల బండి దొరకువఱకుఁ బ్రయాణము నిలిచి కష్టపడవలసివచ్చును. కావున నొకదిన మునసే దూరప్రయాణము చేయ గోరువాఁడు శకటము నెట్లు చక్కఁగఁ గాపాడుకొనునో యట్లే మోక్షమును గోరువాఁడును గావలసినంత ప్రయత్నము చేయుటకు దీర్ఘాయువు కోరును. మఱుజన్మమునఁ జేయరాదా యనినఁ బరలోకవాసము, గర్భవాసము బాల్యకౌమారయౌవనదశలు,వీనికన్నిటి కెంతకాలము వ్యర్థమగును ? నెలదినముల ప్రయాణమొక సంవత్సరముచేయుట సుఖమా ? మార్గమునం దెన్ని కష్టములు పడవలయునో యాలోచింపుఁడు కావున దేహమును జక్కఁగ రక్షింపవలయును.

దేహము నేల రక్షింపవలయునో యది మఱవకుడు. ఆత్మభోగార్థము కాదు. జీవుఁడు సంసారసాగరము నుండి తరించుటకు ప్రయాణముచేయువారికి శకటముతో నెంతమాత్రము ప్రయోజనమో మనుష్యునకు దేహము తో నంతే ప్రయోజనము, బుద్ధిమంతుఁ డగువాఁడు శకట మెట్టిస్థితియం దుండిన బ్రయాణము సుఖముగ సాగునో యట్టి స్థితియందు దాని నుంచునుగాని నిష్ప్రయోజనముగ దానికి వృథాలంకారములు జేసికొనుచు నొకచోటఁ గూర్చుండునా ? బండి గట్టిగా నుండుట ప్రధానముగాని వన్నెలు కలిగియుండుట ప్రధానము కాఁదుగదా. కాఁబట్టి వివేకముగలవారు దేహారోగ్యము దేహపటుత్వము చక్కఁగా గాపాడుకొందురుగాని యలంకా రములకై పాటుపడరు నెయ్యిరూపాయల చీరలు రవికలు ధరించిన యెక్కువ ప్రయోజనము, రెండురూపాయల చీర నాలుగణాల రవిక ధరించిన తక్కువ ప్రయోజనములేదు. మానదేహరక్షణముల కెంతమాత్రము కావలయునో యంతమాత్రమావశ్యకము. ఇంతేకాదు. బండిలో మనము ప్రయాణము చేయునపుడది ముండ్లపైఁ బోవును. అప్పు డు ముల్లు మనకు గ్రుచ్చుకొనెనని దుఃఖింతుమా ? బండి యెండలోనుండి వానలోఁ దడియుచుండిన మన మెండినట్లు తడిసినట్లు భావించి దుఃఖింతుమా ? బండిలో నొక వలక యూడిన మన యెముక విఱిగిన దనుకొందుమా ? బండియిరుసే విఱిగె ననుకొందు. మన నడుములు విఱిగె ననుకొందుమా ? బండి చీళిపోయె ననుకొందు. మనము కాలిపోయితి మనుకొందుమా ? అనుకొనముగదా. అట్లే యీ దేహమునకే మేలు కీడు వచ్చినను దేహమునకు వచ్చినట్లు తలంపవలయునుగాని మనకు (ఆత్మకు) వచ్చినట్లు దలఁపరాదు. ఈ బండిగా కున్నను మఱియొక బండి యబ్బును అని ధైర్యము తెలివి తెచ్చుకొని దేహమున కే సుఖము వచ్చినను ఏ దుఃఖ ము వచ్చినను దమకుఁగాదని తలఁచువారు జ్ఞానులు. ఒకఁడు దారిపయనము చేయనపుడు చల్లనినీడలోఁ బోవలసివచ్చును. మిడిమిడి కాలు నెండలోఁ బోవలసివచ్చును. ఒకచోట మంచి పూలవాసన కొట్టును. ఒక చోట గౌలుకంపు కొట్టును. ప్రయోజముమీఁద దృష్టిగల వాఁడు వీనినెల్ల గమనించునా ? దేహయాత్రము నట్టులని యెంచుకొని దేహమును గాపాడుకొనుచు జీవుఁడు తరించు కార్యములు చేయుచుండవలయును. దీనికే యాత్మా నాత్మావివేకమని పేరు.

మహాలక్ష్మమ్మ– జీవుఁడు తరించు మార్గమేది ?

తండ్రి– కర్మయోగము. భక్తి యోగము, జ్ఞానయోగము.

రుక్మిణి– అట్లనిన నేమి ?

తండ్రి– భగవంతుఁడు సర్వవ్యాపియని మీరు చదివితిరి గదా, భగవంతుఁడు లేనిచోటు భగవన్మయము కాని పదార్థము లోకమునఁ బరమాణువైనలేదు. అట్లగుటచేత మనదేహములోని ప్రతి పరమాణువునందుఁ జీవునియందును గూడ భగవంతుఁడు నిండి యవి చేయుకార్యముల నెల్లఁ జూచుచు నవి చేసిన పుణ్యపాపముల కుఁ దగిన సుఖదుఃఖములు గలిగించుచుండును. సర్వము భగవన్మయమై యన్నిటికి నాయనే యీశ్వరుండైనపుడు నేను నాది యనుమాటల కర్థము కలదా ? భగవంతునిది కాక మీదియని చెప్పఁదగిన దేదైన నుండినఁ జెప్పుడు లేదుకదా, ఈవిషయము మనస్సున దృఢముగ నిలుపుకొనినవారికి 'నేను' 'నాది' యను అహంకార మమకారములు గలుగునా ? అట్టివా రెవరిని కోపింతురు ? ఎవరిని కోపించినను భగవంతుని గోపించి నట్టే కదా. ఎవరి కే సాహాయ్యము చేసినను భగవంతునకుఁ జేసినట్టే కదా యగును. ఈ విధముగ నాలోచించి యొక జీవికైనను నొప్పి కలుగునట్లు ప్రవర్తింపక యందఱకు సుఖమే కలుగఁగోరుచునట్టి కార్యములే యథాశక్తి చేయుచుందురు.

ఇట్లు సర్వవ్యాపి సర్వశక్తి మంతుఁడునైనవాఁ డీశ్వరుఁడొకఁడేయని నిశ్చయజ్ఞానము కుదిరినవారికి తమకుఁ గావలసిన మోక్షసుఖముగూడ భగవంతుడే యిచ్చును అను జ్ఞానము గలవారై భగవంతుని సేవింతురు. ఇట్లు సేవించుట యందు భేదము గలదు.

పితృభక్తిగల కుమారులు తాము సంపాదించి తెచ్చిన దంతయుఁ తల్లిదండ్రులకిచ్చి వారుపెట్టిన యన్నము తిని వారిచ్చిన గుడ్డ కట్టుకొందురు. శ్రీరాములు ధర్మవ్యాధుఁడు మొదలైన వారి చరిత్రములు మీరు చదివితిరిగదా ? ఇట్టులే కొందఱు తాముచేయు సర్వ కార్యములను "శ్రీకృష్ణార్పణ" మని చేయుదురు తినినీ, త్రాగనీ, నిద్రపోనీ నడవనీ,కూర్చుండనీ, మనస్సు, కాయము, వాక్కు, ఇంద్రియములు, బుద్ధి,ఆత్మ, స్వభావము వీనిచే నే కార్యము చేసినను భగవత్ కైంకర్యమనియే వారు తలంతురు. వారు కార్యములు నిర్వంచనముగఁ జేయుదు రేగాని ఫలమును మాత్రము గోరరు. ఈవిధముగఁ గొందఱు తరింతురు. ఇట్టివారు కర్మయోగులు.

కొంద ఱడును త్రొక్క నేల కడుగనేల ? కోరికలు కోరి కష్టించి ధనాదుల సంపాదింప నేల ? వానిని కృష్ణార్పణమనుచుండనేల ? కోరికలే కోరక యూరకుండుట మేలుకదా యని సర్వకాల సర్వావస్థల సర్వము భగవన్మయమని చూచుచుందురు. ఇట్టివారు జ్ఞానయోగులు. ఈరెండు తెగల వారును భగవంతుని సంతోషపెట్టఁ గోరువారే. భగవంతుఁడు సంతసింపకుండిన మోక్ష మెట్టులు వచ్చును ? బిడ్డలారా ! మిమ్మొక్క విషయమడిగెదను జెప్పుడు ! మీకు ముప్వురు కోడుకులున్నా రనుకొండు. ఒకఁడు చిన్నతనమునుండి అమ్మా అమ్మా యని మీచుట్టు తిరుగుచు నెల్ల వేళల మిమ్ము గాచుకొనియుండి పెద్దవాఁడగుచుండినను మిమ్మును విడనాడక మీకుఁ బాదసేవచేయుచు మిమ్మే ధ్యానము చేయుచు మీరు తన్నుఁ బెంచి పెద్దచేసినవిధమే చెప్పుచు మీయందే ప్రీతి గలిగి మీరుచెప్పిన మాట మీఱక పరిచారకులు చేయుకార్యములన్నియుఁ దానే చేయుచుఁ గలది మీ కిచ్చుచుఁ బ్రతిదినము మీకు నమస్కరించు మన తల్లిదండ్రుల కంటె గొప్పవా రెవ రున్నారను తెలివిగలవాఁడు. రెండవ వాఁడు వ్యాపారమో యుద్యోగమో యేదియో చేసి యాకార్యముల వలన వచ్చు లాభనష్టములు మీకే సమర్పించు వాఁడు. మూఁడవవాఁడు ఇంటిలోనుండు ప్రతిపదార్థము మీదే కదా సర్వశక్తిగలిగిన మీకు నేనేమి ? యిచ్చునదేమి? నే నిచ్చిన మీకొక లాభమును నేనియ్యకుండిన మీకొక నష్టము కలుగునా ? నాకుఁ గానొక ద్రప్పమైనఁబనిలేదు. మీయిష్టమెంత యన్నము పెట్టితిరా పెట్టుఁడు, పెట్టకుండిన పోనిండు అనువాఁడు. తల్లులారా యీముప్వురు మీకొడుకులే. మీయందు గౌరవబుద్ధి కలవారే. అయినను మీకెవరియందుఁ బ్రీతి మెండు ? చెప్పుఁడు.

రుక్మిణి– మొదటివానియందే.

మహా– నాకును మొదటివానియందే.

తండ్రి– ఏమి కారణము ?

రుక్మి–మహా– కారణ మేమున్నది. ప్రేమగల వానియందు బ్రేమ కలిగియుండుట యస్వభావధర్మమేకదా.

తండ్రి– మీరు చెప్పునది సత్యము, ప్రాకృతజనకులయందే యిట్టి గుణముండిన జగజ్జనకునియం దెట్టి ప్రేమ యుండవలయునో యాలోచింపుఁము. కావుననే భగవంతుఁడు భక్తుఁడే యోగిశ్రేష్ఠు డని నా యభిప్రాయమని చెప్పెను. ఈ ప్రేమయందును భేదములు గానవచ్చుచున్నవి. తల్లిదండ్రులయందు బిడ్డకు, బిడ్డయందు తల్లిదండ్రులకు, భర్తయందు భార్యకు, భార్యయందు భర్తకు, స్వామియందు సేవకునకు, సేవకునందు స్వామికి, జారునందు జారిణికి, జారిణియందు జారునకు నుండుప్రేమ వేర్వేరు గుణము శక్తిగలది యగును. తల్లికి బిడ్డయందుండు ప్రేమ సహజముగ బిడ్డకుఁ దల్లియం దుండదు. భార్యకు భర్తయందుండు నంతప్రేమ భర్తకు భార్యయం దుండుట యరుదు. కావుననేకదా వలపు సమంబగుట జన్మవాసనచెలియా యని చెప్పఁబడియెను. ఇన్నిటియందుఁ జేరినను జారునందుండు ప్రేమ నీచవుఁ దరగతియందుఁ జేరినను దారుఢ్యము నందు నిరుపమానమైనది అట్టి ప్రేమ భగవంతునియం దుంచువారి కీ జన్మముననే ముక్తికలుగును. దీనికి గోపికలే దృష్టాంతము.

జ్ఞానయోగ కర్మయోగ భక్తియోగములు మూఁడును మోక్షమును గలిగించునియైన భక్తిలేని జ్ఞానయోగము కర్మయోగము వ్యర్థము. సర్వము భగవన్మయ మను జ్ఞానము దోడు భగవంతునియందు భక్తిఁ గలవాఁడే సంసారము తరించును అట్టులే ప్రతికార్యమునకు కృష్ణార్పణము కృష్ణార్పణమని కేవల వాచాకైంకర్యము చేయుచుండిన నేమి ఫలము ? ' ప్రీతికలిగినకూడు పిడికెఁడు చాలు ' నన్నట్లు ప్రీతిచే ఆకులో నీళ్ళో కాయలో పండ్లో పూలో భగవంతునకు నివేదించిన నాయన సంతోషపడును గాని ప్రీతిలేక పదిలక్షల లిచ్చినను సంతోషపడఁడు. కుచేలుని కథ స్మరింపుఁడు. పెద్దవారి యందలి ప్రీతికేకదా భక్తియని పేరు. మీ రేకార్యము చేసినను జేయకుండినను అకార్యములు మాత్రము చేయక భక్తిగలిగియుండట శ్రేయస్కరము. ఈభక్తి శూద్రులకును స్త్రీలకును బాలురకు వృద్ధులకు మాలమాదిగలకుఁగూడ సుకరము. ఎంత భక్తి యెక్కువయినను నంతమేలు గలదు. అంబరీషరుక్మాంగదులు, గజరాజు, ప్రహ్లాదుఁడు, విభీషణుఁడు, హనుమంతుఁడు, ధ్రువుఁడు, ద్రౌపది, శబరి, గుహుఁడు. జటాయువు లోనగువారే దృష్టాంతము.

భగవంతుని భర్తగాఁ దలఁచినగాని పుత్రుఁడుగా దలఁచిగాని తండ్రిఁగా దలఁచిగాని వారివారి కే భావమందుఁ బ్రీతి యెక్కువో యా యా భావముల ప్రకారము భజింపవచ్చునని ముందే చెప్పితినిగదా. మీకుఁ దల్లిదండ్రులయందును భర్తలయందును నుండు ప్రీతికంటె బిడ్డలు కావలయునను ప్రీతి యెక్కువఁగ నున్న దనుకొనుఁడు. అప్పుడు బిడ్డల కెట్టెట్టి యుపచారములు చేయుదురో, నీళ్ళుపోయుట, పాలిచ్చుట, ఆడించుట, నవ్వించుట, లోనగు కార్యము లెట్లుచేయుదురో యవన్నియు భగవంతుఁడే మీబిడ్డ యనుకొని భగవంతునకు చేయవలయును. అప్పు డట్లుచేయుటకు ఆకాశమునుఁ జూచి ఆకాశము నా బిడ్డ యనుకొనిన మీకు తృప్తిగానుండునా? ఉండదు. కాఁబట్ట బిడ్డవంటి బొమ్మ నొకదాని నుంచుకొని భగవంతుఁడే మీబిడ్డ యనుకొని సమస్తోపచారములు దానికే చేయవలయును. మీకు నిజమైన ప్రీతియుండిన అది బొమ్మగా దోఁపనే తోఁపదు. పిల్లవాండ్రాడుకొనునపుఁడు చూడలేదా ? భగవంతుని విగ్రహమును జూచినపుఁడు భగవంతుఁడను యభిప్రాయము కలుగునేకాని కొయ్యబొమ్మయని యభిప్రాయము కలుగదు మీ అప్పలదో యమ్మలదో ప్రతిబింబమును జూచినపుఁడు ఇది మా యప్ప. ఇది మా యమ్మ. యనెదరా లేదా ? ఆ కాగితపుఁ బటము మీయబ్బ యమ్మ యెట్లాయె ? చెన్నపురి వీథులలో నిలువఁబెట్టఁబడిన బొమ్మలనుఁ జూచి యిది యెవరిని యడిగితివా లేదా. నీకుఁ జెప్పినవారు మన్రో యనియో జార్జియనియో రిప్పన్ అనియో చెప్పలేదా. ఆలోహప్రతిమలే మనుష్యులయిరా ? తత్కాలమున నది లోహమని రాయియను జ్ఞానము కలుగదు. సార్వభౌముని పట్టాభిషేకము నాఁడు ఆయన పటము నేనుఁగుపై బెట్టి యూరేగించిరికదా. ఆగౌరవము నెవరికిఁ జేసినట్టు ? రంగుకాగితములకుఁ జేసి నట్టా ! లేక రాజునకేఁ జేసినట్టా ? విగ్రహారాధనమును దూష్యమనువారు కొందఱు గలరు. తురకులు, క్రైస్తవులు, మతిచెడిన హిందువులు. వీరు వాస్తవముగ విగ్రహములందు గౌరవములేనివారై పీర్ల మీఁదగాని క్రాస్‌మీఁదగాని వారి ఛాయాపటముల మీఁదగాని యెంగిలియుమ్ము వైచియో పొరకతోఁ గొట్టియో, పేడనీళ్ళుచల్లియో యవమానించిన వారు మనస్సునైన కోపింపకుందురా ? రాయి, లోహము, కొయ్య, కాగితమనే గురుత్వమే కలవారైనయెడల కోపమేల ? నిరాలంబోపాసనచేయు యోగీశ్వరులుఁ దప్ప తక్కినవారు విగ్రహారాధన మక్కరలే దనిరేని వారు నిజము తెలిసిన వారుగారని నమ్ముము. విగ్రహారాధనముచే నిష్టసిద్ధి పడసిన యేకలవ్యుఁడు, ధ్రువుఁడు, గోపికలు, రామదాసుఁడు లోనగు భక్తకోటుల స్మరింపుము. సీతారాములును విగ్రహారాధనము చేసినవారే. వృక్షములను నదులను బూజించ మ్రొక్కినవారే. బాల్యమున నిరాధారముగ నడువనేర్చుకొంటి నను వాఁడెంతటి బుద్ధిమంతుఁడో, గుఱికొట్టి నభ్యసింవకయే యాకాశము బాఱెడి పక్షులఁగొట్టఁగల ననువాఁడెంతటి మతిమంతుఁడో, యాలంబనోపాసనము లేకయే నిరాలంబోపాసనము చేసెదనువాఁడును అంతటి బుద్ధిమంతుఁడే. అట్టి వంచకుల వివేకహీనుల మాటలువిని బుద్ధిలేనివారు చెడుదురు.

రుక్మిణి– సీత సావిత్రిలోనైన యుత్తమ పతివ్రతల లక్షణము చెప్పుమని యడిగిన నీవు భక్తియోగము గుఱించి చెప్పుచున్నావేమి ?

తండ్రి– సీత సావిత్రిలోనగువా రనుష్ఠించినది భక్తి యోగమే. వారనుష్ఠించినది యుత్తమమైన పరమభక్తి. ప్రహ్లాదాదుల హరిభక్తి యెట్టిదో సీతాదుల పతిభక్తియు నట్టిది. భక్తియనునది స్నేహపూర్వకచింతనమని చెప్పితిని గదా. ఇట్టి చింతనము తనకంటె గొప్పవారియందు వర్తించెనేని భక్తియగును అందఱకంటెను గొప్పవాఁడు భగ వంతుఁడే కావున భక్తి యనునది వాస్తవముగ భగవంతునియందలి ప్రీతికే యన్వయించినను భగవంతునితో సమానులుగ నుండు తండ్రి, తల్లి, గురువు, భర్త, రాజు వీరియందలి ప్రీతికిని భక్తియని పేరుకలదు. మీకు లక్ష్మీ దేవియందు భక్తిగల దనుకొండు. మీరు నిజమైన భక్తిగలవారై తిరామనముసేవించు లక్ష్మీదేవియే యుత్తమోత్తము రాలు. ఈమెను మించిన దేవతలు లేరు. మన కోరిక లన్నియు నీమెయే సమకూర్చును.

ఈమె యీయఁజాలని కోరికలు లేవు అని నిశ్చయము చేసికొని మీ మనస్సంతయు లక్ష్మీదేవియందే యుంచి యామెనే ధ్యానించుచు, స్తుతించుచు, బూజించుచు, యామె సేవయే చేయుచు, నామె కథలే వినుచు, నామె యందే ప్రీతి వహించి యామెకు దాస్యము చేయుచు, నామెను విడిచినఁ బ్రాణము పోవునోయని భయపడుచు సకలవిధముల సర్వకాల సర్వావస్థల భయపడుచు సకలవిధముల సర్వకాల సర్వావస్థల నామెనే కొలుచుచుండ వలయును. ఇట్లు మీరు భక్తిచేయుచోట నెవరైన మీతో లక్ష్మీదేవికంటె నామెభర్త యెక్కువగదా, ఆయనను మీరు సేవింపవలసినది. లక్ష్మీదేవియందలి భక్తివలనఁ బ్రయోజనములేదు. సర్వము చేయువాఁడు స్వతంత్రుఁడు నారాయ ణుఁడే గదా యనిన మీరిట్లు చెప్పవలయును. "అయ్యలారా ! మీరు చెప్పిన నారాయణుఁడు గొప్పవాఁడైనఁ గానిండు. ఆయన గొప్పవాఁడైన ఆయనకు నొక నమస్కారము గావించెదము కాని మా కాయనతోఁ బనిలేదు. సము ద్రుడు గొప్పవాఁడా ? మేఘములు గొప్పవా ? పంటలు పండించు కొనువారికిని లోకమునకు నుపయోగకరము లైనవి మేఘములా ? సముద్రుఁడా ? లక్ష్మీదేవి ప్రేమస్వరూపిణికదా ? ప్రేమలేని నారాయణుఁ డేమిచేయగలఁ డు ? ప్రకృతి కధిష్ఠాన దేవత లక్ష్మియే కదా ? ప్రకృతి లేకున్న ఆయన యే కార్యము చేయగలఁడు? సర్వశక్తి లక్ష్మియేగదా. శక్తిహీనుఁడైనవాఁ డేమిచేయఁగలఁడు ? బిడ్డలపైఁ దల్లికిఁ బ్రేమ యెక్కువా తండ్రికిఁ బ్రేమ యెక్కువా ? కాఁబట్టి మేము జగన్మాతనే కొలిచెదము. తల్లివెంటఁ దండ్రియుండును" అని మీయిష్టదైవమందు మీరు ప్రీతి దృఢముచేసికొనవలయును. ప్రతి మనుష్యున కొక్కొక యిష్టదైవముండునుగాని లేకుండఁబోదు. నాస్తి కుల కే దేని గుణమైన నిష్టముగ నుండును. తన యిష్టదైవమునందు మాత్రమే భక్తియుండుటకే యనన్యభక్తి యని పేరు.

మన శాస్త్రములందుఁ దల్లి, తండ్రి, ఆచార్యుఁడు, భర్త ప్రత్యక్ష దేవతలని చెప్పుట మీకుఁ దెలియునుగదా అట్లనిన నేమి ? ఏకాంతభక్తుఁడు తన యిష్టదైవమును ఏ విధముగ మనోవాక్కర్మముల సర్వదా సేవించునో యట్లే పితృభక్తి గలవాఁడు తల్లిదండ్రులను, గురుభక్తిగలవాఁడు ఆచార్యుని. పవిత్రత భర్తను సేవింపవలయునని భావము.

రుక్మి– తల్లి దండ్రులు మనుష్యులుగదా వారిని సేవించిన దైవమును సేవించిన ఫలమెట్లు వచ్చును ?

తండ్రి– నేను భక్తివిషయమున విగ్రహారాధనము గుఱించి యేమి చెప్పితినో స్మరింపుఁడు రాతిబొమ్మలను కొయ్యబొమ్మలను దేవుఁడు భావముతోఁ బూజించిన మన కోరికలు ఫలించు చుండఁగా నిఁక బ్రాణముతోఁ గూడి మనకన్నులకు గోచరించుచు మన కుపకారముచేసియు చేయుచు నుండువారిని దైవమని పూజించిన మన కోరికలు నెఱవేఱుట యేమివింత ? ధర్మవ్యాధ, శ్రీరామ, పరుశురామాదుల వృత్తాంతము స్మరింపుఁడు. దై వము నందు, తీర్థమునందు, క్షేత్రమునందు, గురువునందు, దైవజ్ఞునియందు, మందునందు, మంత్రమునందు నీ భావమెట్టిదో ఫలసిద్ధియు నట్టి దేయని ప్రమాణము నీ భావమున కనుగుణముగా ఫలముండునుగాని వస్తుతత్వ మును బట్టిగాదు. మనకు ఫలమునిచ్చునది మన మనఃస్థితి భగవంతునిఁ బూజించుచున్నామని మన మనస్సున నుండెనా ? మనము దేనిని బూజించినను సర్వాంతర్యామి సర్వభూతమూర్తియగు భగవంతుఁడు తన్నే పూజించి తిమని తలఁచువారికి దైవమును బూజించిన ఫలమే కలుగును. అట్టులే గురుభక్తికలవారికి గురువువలననే సకలార్థసిద్ధి యగును. భర్తను దేవుఁడుగాఁ బూజించు స్త్రీలకు సకలార్థ సిద్ధులు భర్తవలననే కలుగుట వింతగాదు. కా వున సాధ్వియగు భార్య తన భర్తను బ్రత్యక్షదైవమనియే భావింప వలయును గాని మనుష్యుఁడగఁ దలంచుట దోషమని చెప్పఁబడినది. అర్చావతారములను బ్రతిమలుగాఁ దలఁచుట వంటి మహాపాతకము. పతియందు సతి యనన్య భక్తికలిగి భక్తుఁడగువాఁడు వాని యిష్టదైవమున కెట్లు సకలోపచారములు శ్రద్ధాభక్తులతోఁజేయునో

యట్లు పరిచర్య చేయవలయును. ఇట్లు చేయుటచే నిజమైన భక్తుల కెట్టి మహిమకలుగునో యట్టి మహిమ స్త్రీ లకుఁ గలుగును. హిరణ్యకశిపుఁడు పెట్టుబాధలు ప్రహ్లాదుని నేమియుఁ జేయజాలనట్టు రావణుఁడు పెట్టుబాధలు సీతాదేవిని, విశ్వామిత్రుఁడు పెట్టుబాధలు చంద్రమతిని నేమియుఁ జేయఁజాలవయ్యెఁ గదా. భక్తుల చరిత్రములను బతివ్రతల చరిత్రములను బరిశీలించితిరేని భక్తుల మహిమకంటెఁ బతివ్రతల మహిమయే గొప్పదని మీ రెఱుఁగఁ గలరు. ఏల ? శిలామూర్తుల నర్చించువారు భక్తులు. ప్రాణముతోడిమూర్తుల నర్చించువారు పతివ్రతలు కావున వీరే యెక్కువైరి.

మహా- కక్కా ! నీవు చెప్పినది వాస్తవమేకాని కొందఱు భర్తలు భార్యలను దిట్టుదురు, కొట్టుదురు, కోపిం తురు, నానాబాధలు పెట్టుదురు, ప్రీతిలేక చరింతురు. అట్టివారి యందు భార్యల కెట్లు భక్తి కుదురును ?

తండ్రి- అమ్మా ! నీవు చెప్పినది వాస్తవమే. అట్టి భర్తలు తఱచు గలరు. అయినను బతివ్రత లట్టి భర్తలచేష్ట లనుగ్రహముగా నెంతురుగాని విపరీతముగా నెంచరు. ఏలనెదవా ? పతివ్రతలు భక్తులు సమానుల నుట మఱవకుము. భక్తులను భగవంతుఁడు బాధించుటకంటె భర్తలు భార్యల నెక్కువగఁ బీడింపఁజాలరు. ఎప్పు డొక పురుషుఁడు తనయందు భక్తిగలిగి ప్రవర్తింప నారంభించునో యప్పుడే భగవంతుఁడు వానికిఁ గష్టములు గలుగఁజేయ నారంభించును. వాని ధనమంతయు హరించి భిక్షుకునిఁ జేయును. బలియే దృష్టాంతము. వానికి రోగములు నొప్పులు కలుగఁజేయును. ఇల్లు-వాకిలి, భూములు-పుత్రులు, గొడ్డులు-గోడలు, ఆలు-బిడ్డలు లేకుండ జేయును. ఈతి బాధలు కావలసినన్ని కల్పించును. అనుకొనిన పని యనుకూలముగాదు. ప్రతికూలము లన్నియుఁ దమంతటనే వచ్చును. చిత్రహింసలకుఁ బ్రహ్లాదునివలె భక్తుఁడు రామదాసువలె గష్టములకుఁ బాలుపడవలసివచ్చు ను. దుష్టులు నాస్తికులు వీని కంటియెదుటనే మహోన్నతపదవి నలంకరించి సర్వసుఖము లనుభవించుచుందు రు. ఇంతయేల భగవంతుఁడు లేడను బుద్ధి వానికి పుట్టించుట కెన్ని చేయవలయునో యన్ని భగవంతుఁడు చే యును. కొన్ని సమయములలోఁ గష్టపెట్టుటకుమాఱు సుఖైశ్వర్యములు కలిగించి దారపుత్ర పశుబంధుబంధనం బులఁ గలిగించి మనసు వానియందుఁ బోవఁ జేయును. ఇన్ని విధముల నింత కఠినముగా భార్యను బాధించు భర్త యెందైన నున్నాఁడా ? లేఁడు.

భగవంతుఁ డేల యిట్లు భక్తులను బీడించును ? భక్తులపై నాయనకు ద్వేషమా ? కాదు కాదు. ఇన్ని కష్టములు కలిగించిన వీని మనస్సు దృఢముగఁ దనయందే నిలుచునో లేక యీ దేవుఁడు చాలును, నీ కష్టము లు చాలునని భక్తిని మానుకొనునో తెలిసికొనుటకు. భగవంతునియందు భక్తిచేయవలసిననాకు విధి కాఁబట్టి చేసెదను. ఫలముతోడ నా కేమిపని ? మంచిఫలము కలిగినప్పటికే కలుగనీ. ఈకష్టసుఖములన్నియు నేకరూపమున నేకకాలమున కలుగుటకుఁ గారణము భగవంతుఁడే. నా మనస్సు పరీక్షింపఁగోరి యీ కష్టసుఖములు భగవంతుఁ డు కల్పించెనుగాని నాపై ద్వేషబుద్ధిచేఁగాదు. ఈ కష్టములకు భయపడి భక్తి మానితివా యన్నివిధములఁ జెడిన వాఁడనే. కష్టములను లక్ష్యముచేయక 'యివి నన్నేమి చేయఁగలవు' అని ధైర్యముతోఁ గష్టములు సహించుకొను చుండెనా, ప్రహ్లాద ధ్రువ గజరాజ ద్రౌపదులకువలె వీరికిని భగవంతుఁడు ప్రత్యక్షముగనో పరోక్షముగనో సకల శ్రేయస్సులు కలిగించి మోక్షమిచ్చును. ఈవిషయము స్పష్టముగఁ దెలిసినవారుగుటచేత భక్తులెన్నఁడును దైవమును దూషింపరు. ఆయనయందు భక్తియు మానరు. తాము సేవచేయ వదలరు. తమ మనస్సు పరిశు ద్ధముగ నుండెనా తాము తప్పక కడతేఱుదుమని వారికిఁ దెలియును. దైవమును దూషింపకుండుటేకాదు. దైవ మెవరిని నిమిత్తముగ చేసికొని కార్యములు చేయునో యట్టి నిమిత్తమాత్రులైన వారియందును ద్వేషింపరు. ప్రహ్లా దుఁడు తండ్రియందు ద్వేషించెనా ?

పతివ్రతలు నిట్టివారనియే తలంపుము. తమ్ము భర్తలెంత కష్టపెట్టినను. అవమానపఱిచినను, తమయెడఁ బ్రీతితప్పి ప్రవర్తించినను తామేమో వారియందు భక్తిమానరు. తాము చేయవలసిన కార్యములేమో విసుఁగుకొనక ప్రీతితప్పక చేయుచుందురు. భర్తలయందేకాదు. తమ్ము బాధపెట్టు నితరులయందనఁగా నత్తలు ఆఁడుబిడ్డలు వీరియందుఁగూడ వారు ప్రీతివదలరు. ఒకరు ప్రీతి దప్పి చరించిన మనమును నట్లు చరింపవలయునాయనియు వారివలె మనము వర్తించిన మనయెక్కువయేమి? గాడిద గుఱ్ఱ మొకటేకదా యగుననియు సాధ్వులు తలంతురు. కష్టములు దుఃఖములు సహింపక యింద్రియ నిగ్రహము రానేరదు. ఇంద్రియనిగ్రహము లేకున్న మనస్సునకు నిలుకడ దొరుకదు. మనస్సున నిలుకడలేక నిశ్చలభక్తి కుదురదు. పతివ్రలగువారీ విధముగా నాలోచించి ప్రవర్తిం తురు. భక్తుఁడు సర్వభూతదయ గలిగి యెట్లు ప్రవర్తించునో యట్లే పతివ్రతము, బావలు, మఱఁదులు, తోడికోడండ్రు, అత్తలు, మామలు, ఆఁడుబిడ్డలు, సవతులు వీరియందఱయందు దయవదలదు. భర్త కెవరెవ రిష్టులో వారందఱు నామె కిష్టులే గాని ద్వేష్యులుగారు. కావునఁ బతివ్రతయగు స్త్రీ భక్తియోగపద్ధతి నడుచుకొనవలయును.

రుక్మిణి– సీత సావిత్రి మొదలైనవారికి భక్తియోగ మెట్టిదో తెలిసియుండెను గనుక వా రాపద్ధతి ననుసరించి భర్తలను గొలుచుచుండిరి. మా కాయోగవిషయము తెలియదే, మే మెట్లు వర్తింపవలయునో చెప్పుము. భర్తయందుఁ బ్రీతిమాత్ర ముండి చేయవలసిన కార్యములు తెలియక పోయిన నేమి ప్రయోజనము ?

తండ్రి– మేలు బిడ్డలారా ! స్త్రీత్వము చాల నుత్తమమైనది. సుఁడీ. దాని నధమమని చెప్పువారును దలఁచువారును తెలిసినవారు కారు.

ఒక వంశము నుద్ధరించుటకుఁ గూలద్రోయుటకు స్త్రీయే సమర్థురాలు. సంసారమును సారవంతముగఁ జేయుటకు నిస్సారముగఁ జేయుటకు స్త్రీయే శక్తురాలు. పురుషుల సుఖపెట్టుటకు దుఃఖపెట్టుటకు స్త్రీయే జాణ. పురుషుల భోగులఁ జేయుటకు జోగులఁజేయుటకు స్త్రీయే వలఁతి. గృహము స్వర్గమును జేయుటకు నరకమును జేయుటకు స్త్రీయే నేర్పరి. పురుషుల స్వర్గప్రాప్తికి నరకప్రాప్తికి స్త్రీయే కారణభూతురాలు. పురుషుల యశస్సునకు నవయశస్సునకు స్త్రీయే నిదానము. ఇంతయేల ? పురుషుఁడు దీర్ఘకాలము బ్రతుకుటకు వెంటనే చచ్చుటకు స్త్రీయే మూలము.

పగలంతయు నానా విధముల దేహముచేతను మనస్సుచేతను కష్టించి దుఃఖపడు పురుషునకు గృహమున ప్రియురాలి యాలింగన మొక్కటే యత్యంతానందమును గలిగించునది. గృహము విడిచిపోవునపుడు ప్రియురాలికి ముద్దిడి మరల ముద్దుగొనిపోవు పురుషుఁడు రెండంతలు కష్టముజేయ సమర్థుఁడగును. ప్రయాణసమయమునంద లి భార్య వలపు చూపులు రజ్జువులై యతనివెంట బోయి సాధ్యమైనంత శీఘ్రకాలమున భర్తను మరల గృహమున కు లాగి తెచ్చును.

ఎద్దులు చెమటగాఱ పొలముదున్ని పైర్లు పండించును. అవి పండించిన కసవులోఁ బిడికెఁడు యజమానుఁ డియ్యఁ దిని సంతుష్టిపడి యుండును. అట్లే పురుషుఁడును గష్టపడి సంపాదించి తెచ్చి యింట వేసి యాఁడుది జేసి పెట్టినది తినిపోవును. ఏవిధముగ జూచినను భర్తల ప్రాణము మానము సౌఖ్యము కీర్తి ప్రతిష్ట పుణ్యలోకము భార్యస్వాధీనమం దున్నవి.

ఇన్ని కారణములచేఁ బురుషులకంటెఁ దాము గొప్పవారని స్త్రీ లెఱిగి తమ గొప్పతనమును సద్వినియోగ పఱిచి యెదుటివారిని సుఖపెట్టి తామును సుఖపడవలయును. కాని తమ గొప్పతనమును దలఁచి విఱ్ఱవీఁగరాదు దానిని దుర్వినియోగ పఱుపరాదు. పురుష సాహాయ్యము లేదేని స్త్రీలు చేయలఁగల కార్యమేది? పురుషరక్షణము లేని స్త్రీ మానమును బ్రాణమును ధనమును గౌరవమును సర్వమును శీఘ్రకాలముననే నాశనము చేసికొనఁ గలదు. స్త్రీ నింట గూర్చుండఁబెట్టి దానికిఁ గావలసినది సర్వమును తెచ్చియిచ్చుచు నెన్ని విధములనో సుఖపెట్టు చు నది జేసిన పాపమునుగూఁడ దానుబంచుకొనుచు దాని కిహపరసాధకమైన సంతాపము గలిగించువాఁడు పురుషుఁడే కదా ! ఇంతయేల ! గొప్పవారి భార్య లనిపించుకొనినవారు నెందఱనో మీరు చూడలేదా? అన్ని విధముల మీసుఖమే తమసుఖముగఁ జూచుచు మీ మానప్రాణ రక్షణార్థము తమ దేహములనైన విడుచుటకు సిద్ధముగనుండు భర్తలయందు మీకుఁ బ్రీతి కృతజ్ఞ తాబుద్ధి లేదేని మీకంటెను బాపము జేసినవా రెవరు? కాఁ బట్టి మీరు మీచేతనైన మార్గములఁ బురుషుల సుఖపెట్టుచు వారివలన మీరు సుఖపడు చుండవలయును. పురు షుల వంకరమార్గమునఁ బోవుటకు స్త్రీలే కారణము పురుషుల దుఃఖమునకు స్త్రీలే కారణము. కావున బుద్ధిగల స్త్రీలు పురుషులకు సర్వదా యనుకూలు రాండ్రయియే యుండవలయును అట్లుండరేని స్వప్రయోజనము నాశనము చేసికొను మూఢులు, కృతఘ్నులైన పాపాత్మికలు, పరుల బాధించు దుష్టలు, దురాచారములకుఁ బాల్పడిన భ్రష్టలు, అపకీర్తికి స్థానములైన నీచలునై యుభయలోకములఁ జెడుదురు. కావున మీరుత్తమ స్త్రీల చర్యలు నేర్చు కొని యాప్రకారము వర్తింపవలయును.

మహా– ఉత్తమస్త్రీల చర్య లెట్టివో చెప్పుము.

తండ్రి– నేనై కల్పించి చెప్పవలసిన దేదియు లేదు. పెద్దల వాక్యములనే నేను జెప్పెదను వినుఁడు.

పతియందుఁ బ్రేమగల స్త్రీ తన ప్రేమను భర్తకుఁ దెలియఁబఱచుచు నానావిధముల భర్త సన్నిధిని వర్తించును. అదాటున నాభిని, భుజమును, సొమ్ములను నగపడఁ జేయును. పైఁటకొంగును, చీరముడిని, రవికను సవరించుకొనును. తనంతటఁ దానే తలవెండ్రుకలు ముడివీడి జాఱిపోయినట్లుచేసి రెండు చేతులెత్తి మరల ముడివేసికొనును. కనుబొమ్మ లెత్తుచువానిని ఆడించును. దేహమును వణఁకించును. మగనిని యోరచూపు లఁ జూచుచు మగనియెదుట బహిరంగముగా నవ్వును. పాన్పుమీఁద దాను ముందుగ నెక్కును. ఒడలు విఱుచు చుఱొమ్మువిఱిచి యావలించును. ఏదైన చిఱుదిండులో అల్పపదార్థములో యిమ్మని ప్రార్థించును. మగఁడు చూచు

చుండ బిడ్డనెత్తి కౌఁగలించుకొని ముద్దాడును. మగఁడు తన్నుఁ జూచినపుడు తాను మఱియొక్క ప్రక్క జూచును గాని మగడు మఱియొక్కప్రక్కఁ జూచునపుడు తాను మగనినే చూచుచుండును. చెవులు కలియఁబెట్టుకొనును. అతని పరోక్షమున నతనిని బొగడుచుండును. ఇవియన్నియు సాధ్వికి స్వభావముగ వచ్చును.

ప్రేమగలభార్య సర్వదా భర్తతో మృదువుగను బ్రీతితోను మాట్లాడునుగాని కఠినముగఁ బలుకదు. భర్తకుఁ గావలసినప్పుడు తనయొద్దనుండు ధనము సొమ్ము లిచ్చును. అంతకుముం దెవ్వరిమీఁద నెంత కోపముండినను మగనినిఁ జూచిన తక్షణ మా కోపమంతయు విడిచి ప్రసన్నురాలై సంతోష చిహ్నములనే కనఁబఱుచును. తన మగని నెవరైన దూషించిరా తాను వారికి బ్రత్యుత్తరమిచ్చి తన మగని సుగుణములనే వెల్లడించును.

పెనిమిటి మిత్రులను దాను గౌరవించును. ఆయన శత్రువులను దన శత్రువులను నిరాకరించును. మగఁడు జేసిన సాహాయ్యమో యిచ్చిన పదార్థమో యల్పమైనను దానితోనే సంతుష్టిపడి దానినే గొప్పగ భావించును. మగఁ డింట లేనప్పుడు ఆమెకు మనసు వ్యాకులమై యుండును.

లజ్జావతియైన స్త్రీ తన కెంత కామ మున్నను, మగనిని తొలుతఁ గౌఁగిలింప జంకును. పరిశుభ్రములైన వస్త్రములు ధరించి యున్ననగ లలంకరించుకొని చింపిరితల లేక, సర్వదా మగని కింపయిన వేషమునే వేసికొని యుండునుగాని చూచువారికి జుగుప్స గలిగించు ట్లుండదు.

ప్రాయము, అందము, అలంకారము, భర్త యందలి ప్రీతి, దాంపత్యము సుఖకరముగను వినోదక్రీడగను జేయుటకుఁ గావలసిన జ్ఞానము, ఇవి యుత్తమస్త్రీ కుండవలసిన శుభగుణములు. ప్రాయమనఁగా 50 ఏండ్లప్పుడును, 19 ఏండ్లదానివలె నుండుట యని కాదు. దేహమట్లుండుట సాధ్యము కాదుగాని, ఆరోగ్యము చక్కఁగఁ గాపాడుకొను బుద్ధిమంతులు ఏండ్లెక్కినప్పుడును ప్రాయమునందలి యుత్సాహము ఉల్లాసము గలవారుగ నుందురు. అందమనఁగా నందఱు దేవలోకరంభవలె నుండుట యని గాదు. అంగవైకల్యములేక నిరాకారగాక యవయవసౌష్టవము గలిగియుండుట. అలంకారము అనఁగా నాలుగుమణువుల బంగారమును మోయుట యనిగాదు. ముఖమునఁ గుంకుమబొట్టు, కన్నులఁ గాటుక, పసుపుపూసికొనుట, చెవులయందుఁ గమ్మలు, చేతులందుఁ గాజులు, శుభ్రవస్త్రము, అలంకారమునందు వస్త్రము ముఖ్యము. రు. 1000 చీర, రు. 100 ల రవిక దొడుగుకొనినవారికంటె పరిశుభ్రమైన తెల్లనిచీర చీటిరవిక దొడుగుకొని యేవియో యొకటి రెండు నగల ధరించువా రెందఱో యింపుగఁ గానవత్తురు. కావున వివేకముగల స్త్రీలు తమకు లేని సొమ్ములకై భ్రాంతిపడి యది యొక కొఱఁతగ నెంచుకొనరాదు. ఇట్టి గుణములు గల యుత్తమురాలు స్త్రీరత్నమని బిరుదు గాంచును. ఈ గుణములు లేని స్త్రీలు గుణజ్ఞుఁడగు భర్త వ్యాధివలెఁ జూచి దూరమునందు తొలఁగుచుండును.

పతివ్రతయు, సాధుస్వభావము గలదియుఁ బరిశుద్ధాహారము మితముగ భుజించునదియు, దియ్యని నగుమోము గలదియు, వాక్కుగలదియు, భర్తయం దత్యంతానురాగము కలదియు నగు స్త్రీ లక్ష్మీదేవి యని ప్రసిద్ధి.

పుసిగాఱు కన్నులు, మిడిగ్రుడ్లు, వదరుఁబోతుఁదనము, ముఱికి, కలహించు స్వభావము గల యాఁడు దానిని రాక్షసియందురు.

ఉత్తమస్త్రీనోట నెన్నఁడును నీచపు మాటలు రావు. ఆమె చెడురంగులవస్త్రముకట్టదు. ఆమె దేహము నెప్పుడు ముఱికిగా నుంచుకొనదు.

ఉత్తమస్త్రీ పురుషునివలె శ్వాసము విడువదు. మగనికి తన భుజము తలగడగా నిచ్చి పరుండఁబెట్టుకొనును. ఆమె తలవెండ్రుకలు సువాసనగలవై యుండును. ఆమె మగఁడు నిద్రించుటకుముందు నిద్రింపదు. మగఁడు నిద్రలేచుటకు ముందే నిద్రలేచును. భర్త నిద్రలేచినవెంటనే యాయానపాదములకు నమస్కరించును. నిద్రపోవునపుఁడు నమస్కరింపదు. బిడ్డలారా ! యిది యిప్పటి మిటారికత్తెలకు విపరీతముగఁదో చునుగాని పతిభక్తిగల సాధ్వు లిటుచేయ జంకరు. ఇటుచేయువారిని జూచి నవ్వువారు లంజెతిఱకము మరిగినవారుగనో దుష్టస్త్రీలుగానో నమ్ముఁడు.

దుష్టస్వభావముగల భార్యలను ఆరోగ్యము చెడిన భార్యలను వివేకముగల పురుషులు నిరాకరింతురు ఎవతె శోణితము నల్లగను, ఆకుపచ్చగను, పసుపుపచ్చగను, రాగి వర్ణముగను నుండునో యట్టి స్త్రీలనుగూడఁ బురుషులు నిరాకరింతురు కుందేటి నెత్తుటి వర్ణముగాని లేక యల్లుప్రత్తిరసము వర్ణముగాని కలిగి బాగుగ రుద్ది కడిగినపుడు కానరాకపోవునో యట్టి నెత్తుఱు పరిశుద్ధమైనది. కావున స్త్రీలు ఆహార దేహ పరిశ్రమాదులచే నిట్టి నెత్తురు సంపాదించుకొనవలయును.

అతినిద్ర, అతిరజస్స్రావము, అతిపైత్యము, అతిశ్లేష్మము, అతివాయువు గుణము గలట్టియు పలుమాఱు విశేషించి చెమటగార్చు నట్టియు న్యూనాంగముగాని యధికాంగముగాని కలట్టియు కుఱచలు తెలుపునై తల వెండ్రుకలు కలయట్టి స్త్రీలతోను అతి మాంసముతోడి పిక్కలు పెద్దపొట్ట గలట్టియు, అఱుచుచుండు స్వభావము

గలట్టియు నవలక్షణములు గలట్టియు స్త్రీలతోఁ బురుషులు కలియరాదు. ఆరోగ్యము చక్కఁగఁ గాపాడుకొనువారి యం దీ దోషము లుండవు.

సుశీలముగల స్త్రీ మగనిని చూచినంత మాత్రముననే సంతోషించును, పతి తన్నుఁ జూచినపుడు తల వంచుకొనును గాని యాప్రక్క నాప్రక్క చూచుచున్నట్టె భర్తను జూచును. మగనిమాటలు వినుటయందు మిగుల సంతోషము గలదగును.

రతికాలమున రహస్యాంగములను వెలిపఱుచును. ప్రయత్నపూర్వకముగ ఆ యంగమును మఱుఁగుపఱు చును. మగఁడు దానిని జూచునపుడు ఆలింగనము చుంబనము మొదలగు వానిచే నతని మనము త్రిప్పును. పతి తో యథార్థముగనే యాటలాడును. మగఁడు తాఁకినంతనే యంగములు పులకరించును. చెమటయుఁ బట్టును. మగఁడు సంపాదించుటకు సులభముగానుండు వస్తువునే యాచించును. ఆయన యే స్వల్పపదార్థ మిచ్చినను మిక్కిలి సంతోషించును. మిక్కిలి కోరికగలిగినఁ దప్ప నల్పవస్తువునైనను అది కావలయునని యడుగదు. మగఁడు పంపిన వస్తువును అతిప్రీతితో గ్రహించును. మగఁడు తన్నాలింగనము చేసినపుడు అమృతము పూసికొన్నట్లు సంతోషించును. మగనిని నిద్ర లేపవలసియుండిన నతని తొడ తాఁకి తట్టి లేపును.

స్త్రీలు ప్రతికూలభావము విడిచి త్రికరణశుద్ధిగా భర్తను బ్రత్యక్షదైవముగా భావింపవలయును. మగని యిష్టప్రకారము గృహకృత్యము లెల్లఁ జేయవలయును. ఇల్లంతయు నలుకవలసిన చోటులను వేళను గోమయముచే నలికి పరిశుద్ధముగ నుంచుకొనవలయు.

వ్యభిచరించు స్త్రీలతోడను, మంత్రవాదినులతోడను,నటులను విటులను జేరిన స్త్రీలతోడను,పూవుల తములపాకు లమ్ముదానితోడను,జోగురాలితోడను,సదాసంపన్నురాలుగాని విధవతోడను సాధ్వియగు స్త్రీ సహవా సము సంభాషణము చేయరాదు. భర్తయెదుట జేయఁదగిన విలాసచేష్టలు మఱి యెవ్వరియెదుటఁ జేయరాదు. పతివ్రతయగు స్త్రీ నిర్జనప్రదేశమందుఁగాని తనవాకిటఁగాని యొంటిగ నిలువరాదు. భర్త యిష్టముగాని మాటలు నెప్పుడు మాటలాడరాదు. జనములేనిచోటును, ఇంటి పెరడులందును,తోఁటలందును బరపురుషులతో మాటలాడ రాదు. భర్తను దప్ప మఱియే పురుషుని అనురాగదృష్టితోఁ జూడరాదు. తాఁకరాదు. వానినివిషయమై యనుకొనను రాదు. కార్యములేక మగనినైనఁ బలుమాఱు చూచుట పలుకరించుట తగదు.

వివాహములకు యజ్ఞములకు దేవోత్సావాదులకుఁ బతియాజ్ఞ పొంది పదినెలు అత్తలు మొదలైన మగని చుట్టాలతో గూడి పోవలయును.

మగఁడూరలేపుడు ముత్తైదువపోఁడిమికి గావలసిన మంగళసూత్రము మొదలగు నొకటిరెండు నగలు తప్పఁ దక్కిన యాభరణములను ధరింపరాదు. సొగసులు చేసికొనరాదు. కామోద్దీపనముల నెల్ల వదలవలయును.

మగని కిష్టములైన శాకపాకాదులు శుచిరుచి కలిగియుండునట్లు సిద్ధముచేయవలయును, చేయింపవల యును గాని వంటవానిపై భారమువైచి యూరకుండరాదు. ఆరోగ్యకరము లైన పదార్థములనే సిద్ధము చేయింప వలయను. ఒక వ్యంజనము వాయువుగుణము కలదుగనేని మఱియొకటి దానిదోషము పోఁగొట్టునదిగ కనిపెట్ట వలయును. సిద్ధము చేయించు భోజ్యములు దేహమునకు బలము, నారోగ్యము నిచ్చునవిగ సుఖముగ జీర్ణించు నవిగ నుండవలయును.

భర్తవస్త్రములు శుభ్రములుగ నుండునట్లు కనిపెట్టవలయును. మాసినవి చాకలివానికి వేయుట, యేయే సమయమున భర్త యెట్టివస్త్రము ధరించునో యట్టి దాయన కిచ్చుట చాకలికి వేసిన వస్త్రములు రాఁబట్టుకొనుట లోనగు కార్యములు భార్య చేయవలయును.

మగనిపఱువును బ్రతిదినము దాని విదలించి పఱుచుచుండవలయును. ఇంత యేల ? కుమారీహిత చర్యలోని కార్యముల నెల్ల స్మరించి యాయా సమయమున కా యా కార్యము భార్యయే చేయవలయును.

పతియందు భక్తిగల స్త్రీలు భర్తలను విడిచి తీర్థములకు క్షేత్రములకు యాత్రలకు నుత్సవలముకుఁ బోరు. పతితోనుండుటే వారికి సర్వము. పతిదర్శనమే వారికి దేవతాదర్శనము. పతిసల్లాపమే వారికి దైవస్తుతి. పతిని సమీపించి యుండుటే వారికి సామీప్యముక్తి, పతియుండునింట నుండుటే వారికి సాలోక్యము. పతికిష్టమైన శృంగారము చేసికొనుటే వారికి సారూప్యముక్తి. పతిని కలయుటేసాయుజ్యము. పతితోడ నేకాంతమున నుండుటే కైవల్యము. పతిచింతనమే ధ్యానము. పతిసేవయే యమనియమములు. పతిప్రక్కనఁ గూర్చుండుటే ఆసనము. పతిని సుఖింపఁజేయఁ బ్రాణములు ధరించుటే ప్రాణాయామము. పతికిఁ గావలసిన పదార్థములను ప్రోగుచేయుటే ప్రత్యాహారము. పతి కార్యభరములను ధరించుటే ధారణము. పతిని విడిచి మఱి దేనిని చింతింపకుండుటే సమాధి.

తానుజేయు సకలకర్మములు మగనిప్రీతికై చేయును గాని తనకొఱకుఁగా నొకటియుఁ జేయదు. తన కనన్యగతిపతియేకాని మఱియేదియుఁ గాదని యా మహానుభావురాలు తలఁచుచుండును. ఇట్టి సతీరత్నమునకు దేవపూజ లేల? యాత్రలేల ? తీర్థములేల? వ్రతములేల ? పతియం దిట్టిభావము లేని యాఁడుదానిని నన్నివ్రత

ములు తీర్థస్నానములు ఉపవాసములు వ్యర్థములు. ఇట్టిది మనస్సుచే వ్యభిచరించునదే కదా ? ఇంటఁ దన కిహపరసాధకగతియై ప్రత్యక్షమై పతియుండ వేఱుదైవమును దలంచుదానికి చెడుపెకు నేమి భేదము ?

భక్తులగువారు తమ యిష్టదైవమే సర్వోత్కృష్టదైవముగఁ దలంచి యనన్యభక్తిఁ జరించుచుండినను నితర దైవముల నెన్నఁడు దూషింపరు, తిరస్కరింపరు, పరిహసింపరు. అట్లేపతివ్రతలగు స్త్రీ లకు భర్తయే యిష్టదైవమైనను నింట నుండు తక్కినవా రెట్టివారైనను వారిని దూషింపరు. తిరస్కరింపరు, పరిహసింపరు. అట్టి యత్తలు ఆఁడుబిడ్డలు లోనగువారు దుష్టురాండ్రై తన్ను బాధించినను, దిట్టినను, దిట్టించినను, గొట్టినను గొట్టించి నను, వారి విషయమై మనస్సునఁ గూడఁ గీడు తలఁపరు. ఇఁక ముఖము మాడ్చుట, పెదవులు విఱుచుట, మెటికలు విఱుచుట, గొణుగుట, సొణుగుట, మగవానితో వారిపై నున్నవి లేనివి చెప్పుట యిట్టివి చేయరనివేఱుఁగ జెప్పవల యునా? తా నెన్ని కష్టములైన సహించి తిట్టినఁ దిట్టనీ, కొట్టినఁ గొట్టనీఁ చంపినఁ జంపనీ ఆ పాపపుణ్యములు వారివెకాని నావికావు. వారు పాపము చేయుచున్నారని తెలిసినే నెట్లు వారివలె బదులు పాపము చేయుదును? ఈ దేహమునేకదా వీరు బాధింతురు. నిజమైన నన్నేమి వీరు చేయఁగలరని జ్ఞానముకలదై తాను గన్నీరుపెట్టిన మనస్సున దుఃఖపడిన తన మగనికే హాని యగునని తలఁచి పతివ్రత యేనాఁడును దుఃఖింపక ప్రసన్నత వదలకయే యుండును. ఇట్టి వారిపట్ల కీడు చేయరాదు ప్రహ్లాదునకుఁ గీడుచేసిన హిరణ్యకశిపునివలె నగుదురు

ఈప్రకారముచరించుస్త్రీలు కర్మయోగము రాజయోగము భక్తియోగము జ్ఞానయోగము లోనైన యోగము లన్నియు సాధించిన మహాత్ము లే పుణ్యలోకములకుఁ బోవుదురో యాలోకములకుఁ బోవుదురు. మీఁదఁజెప్పిన గుణములు దెం తెంత కొఱఁతవడునో స్త్రీలయం దంతంత యోగ్యతయుఁ గొఱఁతపడినదని తలంపుఁడు. ఈగుణ ములకు విరుద్ధములయిన గుణములుండిన దానిని దుష్టస్త్రీగానేనమ్మును. అట్టివారితో సాధ్వులు సహవాసము చేయరాదు.

ప్రీతిలేనిభార్య కనుబొమ్మలు ముడిపెట్టును. మగనిదిక్కువీఁపు త్రిప్పియుండును. మగఁడు చేసినమేలు మఱచును. మగనిని జూడఁగానే చాకిబండవలె లేవకుండును. నిలఁబడి యుండెనా నిత్రాతివలెఁ గదలకుండును. ముఖమున వికాసముండదు. పెదవులు మొద్దువలె గదలకుండును. మగని విరోధములతో స్నేహము చేయును. పరు షముగ మాటలాడును. మగఁడు చూచినంత, తాఁకినంత మాత్రమున భయముచేతనో కోపముచేతనో దేహము కదలించును. గర్వము కోపము గలదై వినయము లేకయుండును. మగఁడు తనపై గోపించి పోయినపుడు పోయిన పోనీ యెవరి కేమియని యతని శాంతిపఱుపక యూరకుండును. మగఁడు ముద్దుపెట్టుకొనినఁ దుడుచుకొనును మగనికంటె ముందు నిద్రపోవును. ఆయన నిద్రలేచిన పిమ్మట నిద్రలేచును.

దుష్టస్త్రీ బిచ్చకత్తెలతోడను, జోగురాండ్రతోడను, పనికత్తెలతోడను, దాదులతోడను, పనికత్తెలతోడను, దాదుల తోడను, చాకలి మంగలి స్త్రీలతోడను, పూవు లాకు లమ్ముదానితోడను, విటకత్తెలతోడను, తార్చువారితోడను స్నేహము చేయును. రాత్రులందుఁ దిరుగఁ బోవును. వ్రతము నెపముపెట్టి రాత్రులందు మేలుకనియుండును. దొంగరోగము పేరు చెప్పి పతితోఁ గలియకుండును. విశేషకాలము పొరుగిండ్లయందే యుండును. ఆటలకుఁ బాటలకుఁ బోవు చుండును. జోస్యులతో నొంటిగ నాలోచనలు సేయును, సాధ్వులు పోరానిచోటులకుఁబోవును. మగని యెదుట శరీరమును దాఁచును. మగనియెదుట చేయఁదగు కార్యములు పరపురుషుల యెదుటఁ జేయును. అలంకరించుకొని వలసిన సమయ మెఱిఁగియు నలంకరించుకొనకుండును.

దుష్టస్త్రీల స్మరించుట పాపమునకుఁ గారణము కావున వారినిగుఱించి విశేషము చెప్పుటకు నాకు మనస్సొప్పదు. సతీధర్మములని పూర్వులు చెప్పినవి మఱికొన్ని చెప్పెదను. వానివలన నింకను సతీలక్షణములు తెలియఁగలరు. ఎవని భార్య దేహమునందును మనస్సునందును వాక్కునందును పవిత్రురాలో, కార్యములు నిర్వ హించుటయందు దక్షురాలో, భర్తను ననుసరించి చరించునో, యెల్లప్పుడు మధురముగ భాషించునో యామెయే లక్ష్మిగాని లక్ష్మి లక్ష్మిగాదు.

ప్రతిదినము నేను గుమారీహితచర్యయందుఁ జెప్పినపద్ధతి స్నానముచేయునో, దేహమున మఱికి లేకుం డునట్లును సువాసన గలిగియుండునట్లును గనిపెట్టునో, ప్రియముగ మాటలాడునో, మితముగ భుజించునో, మిత ముగ పలుకునో యామె దేవతయేగాని మనుష్యస్త్రీ గాదు.

రూపసంపన్నయు, గృహ వ్యవహారముల నిర్ణయించుట యందు నేర్పరియు, ప్రేమపూర్ణయు, ప్రియముగ మాటలాడునదియు, సత్కులోచితచర్యలు గలదియు, అనుకూలపతియునగు భార్య యదృష్టవంతునకుఁగాని లభింపదు.

ఇల్లు ఇల్లుగాదు. ఇల్లాలే ఇల్లు. ఇల్లాలు లేనియిల్లు కాఱడవి సమానములు.

ప్రీతిగలభార్య యుండెనేని చెట్టుమొదలైనను గృహమే యగును. ప్రీతిగలభార్య లేకుండిన మేడలైనను వల్లకాడులే.

కులస్త్రీ మర్యాదయ సిగ్గు బిడియము లేని యిల్లాలికంటె బోగముది మేలు. కావున నట్టిభార్యను విడుచు వాఁడు సుఖము కీర్తి గాంచును. కార్యములందును,ఐశ్వర్యమందును,సుఖమందు నుండు ప్రీతికంటెఁ దనయందు భర్త కెక్కువ ప్రీతి యుండునట్లు చరించు భార్య సుఖాత్మురాలు, పుణ్యాత్మురాలు.

మగనికి వశురాలును,మంచి మనస్సు గలదియు,మంచి వ్రతములఁ జేయునదియు,కార్యములందు హెచ్చరిక గలదియు, ఇతరులయందు మనసుపోనీయనిదియు, సంతోషముతో గూడినభార్యకు ధర్మచారిణియని పేరు. సూర్యోదయమునకు ముందే నిద్దుర లేచునదియు. అత్తమామలకుఁ బెద్దలకు శుశ్రూషచేయునదియు,గృహము దేహము పరిశుద్ధముగనుంచుకొనునదియు,తల్లిదండ్రులయందు భక్తి గలదియు,పతియే దైవమని,పతియే బంధువని,పతియే గతియని, పతితో సమానమైన గతిగాని దైవముగాని లేదని తలంచునదియే పతివ్రత.

బాలికయైనను వయస్సువచ్చినదైనను వృద్ధురాలైనను తండ్రికో,మగనికో,పుత్రులకో,బంధులకో లోపడి యుండవలయునుగాని యింటనైనను,స్త్రీ స్వతంత్రించి చరింపరాదు. పతిసేవకంటె స్త్రీకి వేఱుగ యజ్ఞముగాని వ్రతముగాని ఉపవాసాది వ్రతములుగాని లేవు. స్త్రీకి నన్నిటి ఫలమును బతిశుశ్రూషయే యిచ్చును.

పాణిగ్రహణము చేసికొనిన స్త్రీ పతివ్రతయై పతి యుండులోకమునఁ దాను నుండి సుఖింపగోరెనేని యతఁడు బ్రతికియుండినపుడైనను మరణించిన తరువాతనైనను నతనికి నప్రియ మాచరింపరాదు.

మగఁడు జీవించియుండువఱకుఁదాను జీవించును. పతి మరణించినఁ దానును మరణించును. పతి సంతోషించినఁ దానునుసంతోషించును. సహజస్నేహముతోఁ గూడిన యట్టి కులస్త్రీకి సమానమైన పదార్థము లోకమున నేది గలదు ?

ఆలోచనలందు మంత్రివలెను, కార్యములు చేయుట యందు దాసివలెను. భోజన మిడుటయందుఁ దల్లివలెను,శయనమందు రంభవలెను,ఓర్పునందు భూమివలెను, ధర్మమందనుకూలవతిగను నుండు భార్యదొరకుట దుర్లభము.

లజ్జచే శిరసు వంచుకొని నేల చూచుచుండు నిల్లాలిచెక్కిలి నెవ్వఁడు ముద్దాడునో యాపురుషుఁడు నానాజనులచే గాయపఱుపఁబడిన వేశ్యల పెదవులందు నేల యాసక్తిగలవాడగును ?

కులకాంతకుకఁ దన యింటివాకిలి కావల బెట్టెడి యడుగుపాముతలపైఁ బెట్టినట్లుండును. పొరుగింటికిఁ బోవుట ద్వీపాంతరవాసము. ఆమె వాక్కు చూపు లోభిచేత ధనమువలె నలభ్యములు. పరపురుషుని ముఖము చవితిచందురుని వంటిది. పతియందు భక్తి, ఆశ్రితులయందు దయ, అత్తమామలపట్ల నణకువ, తోడికోడండ్రయందు ఆడుబిడ్డలయందుఁ బ్రీతి, పెద్దవారియందు గౌరవము,నేరముచేసిన వారియందును ఓర్పు,సంతోషముతోఁ గూడిన ముఖము, భర్తకుఁ బ్రియురాండ్రు గదాయని సవతులయందు ప్రియసఖిభావము గలిగియుండుట కులస్త్రీలకు వ్రతము.

మగఁడు వచ్చిన లేచుట, ఆయన మాటలయందు నణకువ,ఆయనతో మాటలాడునపు డాయన పాదములందే దృష్టియుంచుట ఆయనకుఁ గావలసిన కార్యములు సేవ తాను స్వయముగఁ జేయుట,ఆయన నిద్రించిన తరువాత నిద్రించుట,ఆయనకంటె ముందే నిద్రలేచుట,కూఁతులారా ! యివి కులస్త్రీల ధర్మములని పూర్వులు పెద్దలు శాస్త్రములందుఁ జెప్పిరి.

గురువులకు శుశ్రూషచేయుము,సవతులను స్నేహితురాండ్రవలెఁ దలంపుము. మగఁ డపరాధము చేసినను గోపముచే నీవు బదులు చేయకుము. పరిజనులయందుఁ బ్రీతిగలదానవగుము. భోగములం దత్యంతాసక్తి మానుము ఇటుచేయువారికి గృహిణి లను పదము తగును. దీనికి విరోధముగ నడచు అధమస్త్రీలు,మగనిపాలి గ్రహిణులు.

పతియెడ వంచన లేక వర్తించుట, ఆఁడుబిడ్డల కణఁగియుండుట,అత్తమామలయందు భక్తిగలిగియుండుట,బంధువులందు బ్రీతి,పరిజనులను బిడ్డలవలె,జూచుట,సవతుల నైనను నవ్వుముఖముతోనే చూచుట,భర్తస్నేహితులయెడ నవినయముగ మాటలాడుట,అతని విరోధులయందు ఖిన్ను రాలగుట,ఇవి మందులు మ్రాకులు లేక మగనిని స్వాధీనపఱచుకొనునుపాయములు.

సంచారమునకు మేర పడకటిల్లు మాటలను మేర ప్రియురాండ్ర కర్ణములు మనస్సునకు మేర భర్తకోరిక నెఱవేర్చుట,విశేషకోపమునకు మేర మౌనము నవ్వునకు మేర పెదవి,చూపునకు మేర యడుగు పెట్టెడి స్థలము,కులస్త్రీలకార్యములన్నియు మేరగలవే కాని భర్తయందలి ప్రీతికి మేర లేదు.

క. తనయుదరకరంబుల నే
వనిత తసదు ప్రాణవిభు సుపాకప్రీతున్
బొనరించునొ యావనితయె
చనును బతివ్రతయు సాధ్వి సతియు సనంగన్

(ఇందు పాకమనఁగా బిడ్డ–వంటయని రెండర్థములు)

మహా– కక్కా ! మీ భర్తలకుఁ దల్లులవలె నన్నము పెట్టుఁడని చెప్పితివే. భార్యలు భర్తల కన్నము పెట్టరా !

రుక్మిణి– అప్పా ! యిప్పుడు నీవు చెప్పిన పద్యములో భర్తకు వంటచేసి పెట్టునది బిడ్డల కనునది సాధ్వి యని పతివ్రతయని చెప్పితివే,వంటచేసి పెట్టువారు, బిడ్డలఁ గనినవారునందఱు పతివ్రతలా !

తండ్రి– మహాలక్ష్మమా ! నీ ప్రశ్నకుఁ దొలుత సమాధానము చెప్పెదను.పోషించుటయందుఁ దల్లికి సమానమగునది యేదియు లేదు.శరీరపోషణమందుఁ దల్లితో సమానమైనదియు,శరీరతోషణమందు భార్యతో సమానమైనదియు,శరీరభూషణమందు విద్యతో సమానమైనదియు,శరీరమును శోషింపఁజేయుటయందు చింతతో సమానమైనదియు నేదియు లేదని సూక్తి గలదు.అంతేకాదు.బయటపోయియుండిన మగవాఁడు ఇంటకిరాఁగానే తల్లి కడుపుచూచును.భార్య రొండిచూచును.ఆఁకలి గొన్నాఁడేమో యని తల్లియు,నేమైన సంపాదించి తెచ్చినాఁడో లేదో యని భార్యయుఁ జూచును.

అంతే కాదు, అనేకజనముల యనుభవము చెప్పెదను.ఉపవాసాది వ్రతములందో లేక భోజనము చేయరాని దినములందో లేక మఱి యే కారణముచేతనో మగవాఁడు నే నీరాత్రికి భోజనము చేయనని చెప్పిన పుడు తల్లి యశాస్త్రీయమైనను సరే దానికి విఘ్నముగ నేదో యొకటి చెప్పును.ఏయే కుమారునకు నే యే పదార్థమం దిష్టమో తల్లికి బాగుగ దెలియును గనుక వానికి నిష్టమైన పదార్థము సిద్ధముచేసి యుంచును.రాత్రి సంధ్యాదికార్యములు తీర్చుకొని మైలదాఁకు సమయమున నాయానా ! కొంచెము ఫలహారము చేసితిని.నీళ్ళక డ్డము.దానిని తినుము, లేకుండిన చాల బలహీనత యగును.అని మెల్లగఁ జెప్పి, చెప్పుచునే ఆకులో నింత తెచ్చిపెట్టును.నేను తిననంటినే యేల చేసితివని కోపించుచుఁ దిట్టుచునే సగము కడుపునకైన వాఁడు దిన లేచును.ఉదయమున లేచి అమ్మా రాత్రి నీవు ఫలహారము పెట్టకుండిన నిప్పుడు పడుక విడిచి లేచుటే కష్టమయి యుండునని కొడుకు చెప్పెను.తన దేహతత్త్వము తనకంటెఁ దన తల్లికి బాగుగఁ దెలిసియుండును.

భార్యయో వలదన్నదే చాలునని యూరకుండును.ప్రీతిగలదైనను అడ్డము చెప్పినఁ గోపించుననియైన నూరకుండును.తల్లి తిట్టు తినియైనఁ దిండి పెట్టును.భార్యకుఁ దల్లికి నిది తారతమ్యము.ఇప్పటికి నామాట నీకు సందేహమగు నేని రేపు నీకు బిడ్డపుట్టినపుడు బిడ్డ యాఁకటికి నేడ్చుచుండ ఆఁకలి కొన్న మగఁడు వచ్చె నేని యా యిరువురిలో నెవరిని ముందు నీ వాదరింతురో తెలిసికొని యప్పుడు నామాట నమ్మింపుము.కావున మీ భర్తలను మీరు తల్లులవలె పోషింపుఁడు.భార్యలవలె వారితో భోగింపుఁడు.

రుక్మిణమ్మా ! యిఁక నీప్రశ్నకు సమాధానము చెప్పెదను.

వంటరాని స్త్రీలు పాకశాలలయం దిప్పుడు సృష్టింపఁబడుచున్నారుగాని యిదివఱకు మనదేశమున వంటయెఱుఁగని యాఁడువారు లేరని నాకుఁ దెలియును.శుచి,రుచి,యాచారము గలట్టుగ వంట చేయలేనివారు ను గలరని నే నెఱుంగని వాఁడను గాను.అన్నమునందు,వ్యంజనములందు వెంద్రుకలు పురుగులు లోనగునవి కలయట్టు వంట చేయువా రెందఱోగలరు.కొందఱు యిండ్లలో వెంద్రుకలు అన్నములో రాని పూఁట యుండుట యరుదు.బియ్యము బేడలు సంభారవు దినుసులు మొదలగునవి వానిని రాలతోడను మంటిపెళ్ళలతోను,వంట చేయువా రెందఱు లేరు ?చింతపండులో పురుగు లుండుట తెలిసియు శోధించుటకు బ్రాలుమాలి యట్టులే నీళ్ళలోవేసి యా పురుగులు మట్టితోడనే పులుసు చారు గాఁచువా రెందఱు లేరు ? ఎన్నిటిలో గండుచీమల తలలు మొండెములు గానరాకున్నవి ?మజ్జిగలోని యెఱ్ఱ చీమల తునకలను, వెన్నపూస నలుసులని చెప్పు స్త్రీ లెందఱు లేరు ?ఎందఱు యిండ్లలో నూరుగాయలకు మీసాలు రాకున్నవి ?పురుగులు లుకలుకలాడ కున్నవి? మిరపకాయకు మాఱుబరిటె పురుగును చారులోని తిరుగఁబోఁతలో వేసిన యిల్లాలిని నాకుఁ దెలియును.ఒక తపెలలో నాలుగైదు విధములుగా నన్నము వండ నేర్పరులగు వంటకత్తెలు లేరా ? బేడ లుడికి యుడకకముందే చారు పులుసులు క్రాఁగీ క్రాఁగకముందే దించు నిల్లాండ్రులేరా ? ఇదంతయునశ్రద్ధను అజాగ్రత్తనుయ సూచిం పదా ?

ఇఁక రుచి నాలోచించిన కొందఱు వంటచేసిన నొక్కవ్యంజనముతోనే కడుపునిండఁ దినవచ్చును.కొంద ఱు పది సాధకములు చేసినను బదార్థనష్టమేగాని సగము కడుపు నిండదు.ఏల ? పదార్థము పాడుచేయుటగాక యే మిది రుచిలేకున్నదే యనిన “నందఱుచేసినట్లే నేనును జేసితి” నని చెప్పువారు లేరా ? ఉప్పుకారము చక్కఁగ వేసిన నుప్పుమట్టి యైన బాగుండునను సామెత యెఱుఁగక యెంతపులుసునకు నెంత యుప్పుకారము వేయవలయునో తెలియనివా రెందఱులేరు ? ప్రొయ్యి యొద్ద 5 నిమిషములు కుదురుగఁ గూర్చుండ లేని ద్రిమ్మరులెందఱో గలరు.మగవారు స్నానము చేయుటకు కాలుగంటముందు స్నానముచేసి యాదరబాదరయబ్బ

శ్రాద్ధము మునిగినట్లు ఏదోయొకటి చేసితిమని యనిపించువారెందఱు లేరు? కట్టెలు వ్యయమగునని బియ్యము ను ముప్పాతిక నానునట్లు నీళ్ళలో పోసియుంచి పిమ్మట యుడికించు నిల్లాండ్రను మీ రెఱుఁగరా ? లోభితనము చేతను, వలసిన పదార్థములను దెప్పించుకొనకయు వేయవలసిన పదార్థములు కావలసినంత వేయక తిరుగఁ బోఁత చక్కఁగ పెట్టక యుండువారు లేరా ?అన్నములో బొగ్గులే మనిన నుడికినదో లేదో యని కొఱవిపట్టి చూచునపుడు పడినవని చెప్పు వంటకత్తెలు లేరా ? వంటప్రొయ్యులు వారమున కొకసారి నలుకని యిల్లాండ్రు లేరా ? క్రొత్తగ చూచువారికిఁ దిన్నకూడువాంతి యగునట్లు వంటయిండ్లు పాత్రము లుంచుకొను సొగసుకత్తెల మీకుఁ దెలియదా ? ఎంగిలి విస్తళ్ళ మధ్యాహ్నము వఱకుండి యప్పు దేనాదులో శూద్రులో తురకలో యెత్తినఁ గాని దిక్కులేని కొంపలు లేవా ? ఒకటే గుర్తు మనసుననుంచుకొనుఁడు. ఎవతె యెక్కువ సొగసుకత్తెయా దాని యిల్లు పెంటదొడ్డివలె నుండును. ఎవతె దేశముద్రిమ్మరియో యెవతె సోమరియో యెవతె వదరుఁ బోతో యట్టి దాని కొంపయు నట్లే యుండును.

పాకము శుద్ధముగా నుండవలయు ననిన వంటప్రొయ్యులు శుద్ధముగా నుండవలయును. వానిని ప్రతిదిన మలికి ముగ్గు పెట్టుచుండవలయును. చక్కఁగ శుద్ధిచేయని వంటపాత్రము వాడుకొనరాదు. ప్రతిపదార్థము శోధిం చిగాని వాడుకొనరాదు. నూక రాయి చక్కఁజేయక యంగడినుండి తెచ్చిన వస్తువు లట్టే వాడరాదు. ఒడియఁగట్టని నీళ్ళు వాడరాదు. ప్రొయ్యిమీఁది పదార్థము పొగచూరరాదు. పదార్థము మాఁడరాదు. ఉడికి యుడకక యుండరాదు. పాకములోఁ బదార్థములఁ జూచి యవలవేయవలయును. ద్రవపదార్థము పొంగిపోయిన నిప్పు ఆఱిపోవును లేక బూడిద యెగిరి పదార్థమందుఁ బడును. పదార్థ నష్టము కలుగును. ఉప్పు,కారము తిరుగఁబోఁతఁ తగినట్టు వేయవలయును. ఒక పదార్థ ముడుకుటకు కాలుగంట పట్టు ననుకొండు. మరియొకటి యరగంటకుఁ గాని యుడుకదనుకొండు. అట్టి సమయములో ఆలస్యముగా నుడుకునది సగముడికిన తరువాత తక్కినది చేర్పవలయును గాని రెంటి నొక్కసారిగ కలిపి ప్రొయ్యిపై పెట్టరాదు. కొందఱు తిరుగఁబోఁత వేయునపుడు మిరపకాయలు,ఆవాలు మెంతులు ఇంగువ అన్ని యొక్కసారిగ గరిఁటెలో వేయుదురు. ఇటువేసిన ఆవాలు నానిపోవును. చమురు కాఁగిన తరువాతనే ఆవాలు వేయవలెను. ఆవాలు వేసిన వెంటనే చిటపటధ్వని పుట్టవలెను. కొందఱిట్లనుటకు ముందే వేయుదురు. మెంతులు ఆవాలు సరిగ వేఁగకుండిన పదార్థము చేఁదెక్కును. ఇట్టులే యన్ని చక్కఁదెలిసి చేయవలె ను. శుచిగానుండవలసిన పదార్థములు పాత్రములు మాత్రమే గావు. వంటజేయువారి దేహములు వస్త్రములుకూడ శుచిగా నుండవలెను. వంటయింటికి భోజనశాలకు సమీపమునఁ దలదువ్వ కొనరాదు. వంటచేయునపుడు తల విరియఁబోసికొనరాదు. వెండ్రుకలు విచ్చి ముడివేయరాదు. దేహము చెమట పదార్థములలోఁ బడరాదు. వేఁడి పదార్థముల మీఁద ముఖ్యముగ ద్రవపదార్థములమీఁద నోటితో నూదరాదు నీ నోఁటి తుంపరలు వానిలోఁ బడును. నీలోని చెడుగాలి వానిలోఁ గలసి వాని ననారోగ్యమునకుఁ గారణమగునట్లు చేయును. వండిన ప్రతి పదార్థముమీఁద మూఁత లుంచవలెను ?గుడ్డ కప్పితివేని యది పాత్రలోని పదార్థముపై బడకుండునట్లు కప్పవ లెను. మూఁత పెట్టుటకు ముందు దానిక్రిందివైపు తుడిచి మఱిమూఁత పెట్టవలెను. స్నానముచేసెడి నీటిలోను పురుగులు పడకుండ మూఁత యుంచవలెను. కట్టెలు ప్రొయ్యిలో నుంచునపుడు చీమలు మొదలైనవి లేకుండఁ జూడవలయును. ప్రొయ్యి నోటితో నూదుట మేలుగాదు. చక్కఁగ వంట నేర్చినవారివలన నివన్నియు మీరు నేర్చుకొనవలెను. వంటచేయునపుడు మనస్సు వంటమీదనే యుండవలెను. చక్కఁగఁ దీరినపదార్థము ఘుమ్మని మంచివాసన కొట్టుచుండును. ప్రతిదిన మొకవిధమైనవానినే భోజనము చేయుట ఆరోగ్యమునకు హాని. కావున స్త్రీలు నానావ్యంజనములను చేయ నేర్చుకొనియుండవలయును. వ్యంజనము సిద్ధముచేయునపు డుప్పుకారము సరిగనున్నదో లేదో యని ముందు రుచిచూడరాదు. పదార్థములు గుణతత్త్వములు తెలిసియుండవలెను. తినువారి దేహతత్త్వములు తెలిసియుండవలెను. దేహగుణమునకు పదార్థగుణమునకు విరోధము లేకుండఁ గనిపెట్టి చేయ వలెను. ఉత్తమ స్త్రీ లిట్టు జేయుదురు.

మీకుఁ దెలియుటకై యొకానొక యధమస్త్రీ వర్తనము నా యనుభవమునుబట్టి చెప్పెదను.

ఒకానొక దంపతుల యింటిలో నేను గన్నారఁ జూచినది చెప్పెదను. ఆ యింట భార్యాభర్త లిరువురు తప్ప మఱియెవరు లేరు. ఆ గృహస్థు 10 గంటలకే యుద్యోగ కారణమున వెలుపలఁ బోవలసినవాఁడు. ఆయూర నేటినీళ్ళు త్రాగుట కుపయోగపడు మంచినీళ్ళు. బావినీ ళ్ళుప్పులు. ఆ మగవాఁడే యేటికిఁ బోయి స్నానముచేసి మంచినీళ్ళు తెచ్చియిచ్చును. ఆ యిల్లాలు 9 గంటలకు వేఁడినీట జలకమాడి తొమ్మిదింగాలు గంటకు వంటప్రొయ్యి యొద్దకు వచ్చును. వచ్చి యొంటికట్టెతో ముందే నానిన బియ్యమును నన్నముగ నుడికించును. ఆవల కందిబేడలు ప్రొయ్యిపై వేయును. అవి సగముడుకు నప్పటికి 9.30 గంట యగును. ఇంతలో నా మగవాఁడు సంధ్యాద్యనుష్ఠా నములు దీర్చివచ్చి కూర్చుండును. ఆ యిల్లాలు "మీ కప్పుడే పోవువేళ అయినదా ? నే నింకను ఏమేమో చేయ వలెనని తలఁచితినే. కందిపప్పే యుడకలేదే ! యేమిచేయుదురు" అని దబదబ యా సగముడికిన బేడలనుబండ

పై వేసి వాని మొగాన నింత నుప్పుజీలకఱ్ఱ యింకేవో కొట్టి తొక్కుగా (పచ్చడిగా) నూరును. తక్కిన వ్యంజనము లూరుఁగాయ,మజ్జిగనీళ్ళు. నేను జూచినన్నాళ్ళిదే వంట. ఆవల పులుసుచారు క్రాఁచును. ఆ యిల్లాలు వేసికొనునో వేసికొనదో నాకుఁ దెలియదు. మగవానికి మాత్ర మింతేతిండి. అలవికాని యాలిని గట్టుకొని ముఱిగి చచ్చెరా ముండ కొడుకున్నట్లు లా సంపన్న గృహస్థు సాధువు కావున నతిశాంతచిత్తుఁడై యో కుటుంబ సౌఖ్యము చెఱుపుకొనుట కిష్టము లేకయో నెలనెలకు 27 దినములయినను దానే వంట చేసికొని తిని పెండ్లానికిఁ బెట్టి పోవుచుండును. అట్టి తిండి తిని,యిట్టి యాలి సేవచేయు మగవాఁ డెంత బలసంపన్నుఁడుగా నుండగలఁడు ? వాడెంత సుఖింపఁగలఁడు ? ఇట్టిది కూడ సాధ్వి సతి పతివ్రత యందువా ? ఇది యాఁడుదా గాడిదా ?

మంచిబిడ్డలఁ గను విషయమై గర్భిణీ హితచర్య యందుఁ జెప్పితిని. ఈ విషయమై బాలకహితచర్యయందును కుమారహితచర్యయందును, పతిహితచర్యయందును జెప్పితిని. వానిని మీరు చదువవలెను. ఇఁకఁ దక్కిన సాధ్వీవర్తనములఁ జెప్పెదను.

---- ఋతుకాలములందు చేయరాని పనులు ----

స్త్రీ ఋతుమతియైన మొదటి దినము మొదలు మూఁడుదినములు బ్రహ్మచర్యవ్రతము గలదై యుండవలెను. అనగా బురుష సంభోగము మానవలెను. పగలు నిద్రింపరాదు. కన్నులయందుఁ గాటుక పెట్టుకొనరాదు. రోదనము,స్నానము గంధము పూసికొనుట,తలంటుకొనుట,గోళ్ళుదీయుట,పరువెత్తుట,దుముకుట,నవ్వుట,అధికముగా మాటాడుట,గొప్పధ్వని వినుట,తల దువ్వుకొనుట,మిక్కుటమైన గాలిలోనుండుట,దేహమలయుపనులు చేయుటయీ కార్యములు మానవలెను. పగటి నిద్రవలనఁ దూఁగుఁబోతు బిడ్డ పుట్టును. అట్టులే కాటుకవలన గ్రుడ్డితనము, రోదనమువలన వికారమైన దృష్టి, స్నానము,గంధము పూసికొనుట వీనివలన సదా దుఃఖించు స్వభావము,తలంటుకొనుటవలన కుష్ఠురోగము,గోళ్ళుతీసికొనుటవలన పుప్పిగోళ్ళు,పరుగెత్తుట దుముకుట వీని వలన చంచల స్వభావము,నవ్వుటవలన దంతములు,పెదవులు,దవడలు,నాలుక వీనియందు క్రోతివన్నె,ఎక్కువగ ముచ్చటలాడుటవలన ప్రలాపము, పెద్దధ్వని వినుటవలన చెవుడు,తలదువ్వుకొనుటవలన బట్టతల,గాలిలో దిరుగుట,ఆయాసము కలిగించు పనులు చేయుట వీనివలన ఉన్మాదము గల శిశువు జనించును.

---- రజస్వలానియమము ----

రజస్వల యయిన స్త్రీ దర్భలమీఁద వస్త్రము పఱిచి కొని దానిపైఁ బరుండవలయును. అన్నములో నెయ్యిగాని,పాలుగాని జేర్చి భుజింపవలయును. ఈ విధముగ మూఁడు దినములు చేసినయెడలఁ బ్రాంతరక్తము పోయి క్రొత్తయావర్తనము కలుగుచున్నది. కావున స్త్రీ పరిశుద్ధ రాలగుచున్నది. ఈ మూఁడుదినములు భర్తను దర్శింపరాదు. నాలుగవ దినమునఁ బరిశుద్ధరాలై స్నానముచేసి క్రొత్తవస్త్రమును ధరించి సొమ్ములు పెట్టుకొని పసుపు గుంకుమములచే నలంకరించుకొని శుభవాక్యములు పలుకుచు భర్తను జూడవలయును. ఋతుస్నానమైన వెంటనే స్త్రీ యే పురుషునిఁ జూచునో యట్టి పురుషునివంటి పుత్రుని గనును. కాఁబట్టి తొలుత భర్తనే చూడవలయును. స్నానము జేసిన వెంటనే మగనిని జూచుటకు వల్ల లేనప్పుడు నోరఁ జింతపండైనను మఱి యేదైన వేసికొని తరువాత నెవరైనఁ జూచుట యాచార మందున్నది. రాత్రి 2 గంటలకుమీఁద ముట్టగునేని యది మఱుసటి దినమునందు జేరును. ఏ వస్త్రముతో రజస్వల యగునో యావస్త్రమునే మూఁడునాళ్ళును ధరింపవలయును. విశేషకారణాంతరము కలిగినఁ దప్ప వస్త్రము మార్పరాదు. పూలు పెట్టుకొనరాదు. తాంబూలము వేసికొనరాదు. ముట్టయినదానిని, ప్రసవించినదానిని,శూద్రాదులను దాఁకరాదు. నీళ్ళు చేఁదరాదు. ఏఱు దాఁటరాదు. ముట్టుత పందుకొనిన వస్త్రములు,కట్టుకొనిన వస్త్రములు మొదలయినవి నాలవనాఁడు చాకలవాండ్రకు వేయవలయును. చాకలివాండ్రు దొరకనపుడు మలినమైన వస్త్రమును క్షారోదకముల నుడుకఁబెట్టి తక్కినవి తానే శుద్ధి జేయవచ్చును. ముప్పది రెండుమార్లు నీట మునుకలు వేయవలయును. అట్టులే యంటుపాత్రములను శుద్ధి చేయవలయును. స్నానము చేయునపుడు దఱువాతతన పెనిమిటిని మనస్సునఁ దలఁచుచుండవలయును. స్నానము కాఁగానే పతిని జూచుటకుముందు వరపురుషుని జూచుట సంభవించినయెడల నాదోషముపోవ సూర్యునిఁ జూచి నమస్కరింపవలయును. స్నానము చేసిన నాఁడు శిశువును దాఁకరాదు. అట్లు తాఁకవలసి వచ్చెనేని పంచగవ్యముగాని ఆవుపాలుగాని తీసికొనికాని యన్న మొకముద్ద తినియైనఁగాని దాఁకవచ్చును. స్నానము చేసినవాఁడు వంటపాత్రములు, దేవపూజపాత్రములు, హోమద్రవ్యములు తాకఁరాదు. నాల్గవనాఁడు వంటలోనగు మడుఁగు కార్యములుచేయరాదు. ఈ కార్యములు చేయుటకు వేఱొకతె యింటిలో లేదేని రెండవసారి స్నానముచేసి తానే చేయవచ్చును.

ముట్టుతతో తొలి మూఁడుదినములందు సంభోగించుపురుషుని యాయువు క్షీణించును. ఇట్లు చేసినవారు సన్నిపాత జ్వరాదులచే మరణించుట యనుభవమందే కనుచున్నాము. ఒకవేళ ప్రథమదినమున గర్భము నిలిచి

నేని ప్రసవమైన వెంటనే శిశువు చచ్చును. రెండవదినమందు గర్భము నిలిచిన యెడల ప్రసవించిన వెంటనే శిశువు చచ్చును. కాదేని పదిదినములలోఁ జచ్చును.

మూఁడవదినమందు, గర్భము నిలిచినా యవయవములు పూర్ణముగ లేనిశిశువు పుట్టును. పుట్టిన వెంటనే కాని యల్పకాలమునఁ గాని శిశువు చచ్చును. కాఁబట్టి ముట్టయిన స్త్రీతోఁ దొలి మూడురాత్రులు సంభోగింపరాదు. ఆవలఁ గొడుకులు కోరువారు 4-6-8-10-12 యీ దినములలో దోషయుక్తముకాని దానినిగఁ జూచి భార్యాభర్తలు కలియవచ్చును. కొమార్తలను గోరువారు 5-7-9-11 దినములందుఁ గలయవచ్చును. పదుమూఁడు మొదలగు దినములు నిందితంబులని సుశ్రుతాచార్యుఁడు చెప్పెను. ఋతుకాలమున ముట్టయినదినము మొదలు 15 దినములు దాఁటిన పిమ్మట భార్యాభర్తలు కలియరాదు. బ్రహ్మచర్యవ్రతము సాధించు పురుషుఁడు తన భార్య ముట్టునీళ్ళు పోసికొనిన తరువాత దానితోఁ గలియ నుద్దేశించునపు డా సాయంకాలమున శరీరమును నేయిరాచుకొని స్నానము చేయవలయును. నెయ్యి పాలు కలిసిన యన్నమును భుజింపవలయును. ఆ విధముగ బ్రహ్మచర్యము నాచరించు నతని భార్యయు నాసాయంకాలమున దేహమునకు నూనెరాచుకొని స్నానము చేసి నూనె మినుములు నధికముగఁ గలసిన యాహారమును భుజింపవలయును.

సంభోగాదివిషయము కొంత పతిహితచర్యయందుఁజెప్పితిని. దానిని మీరు చదివియున్నారుగదా. చెప్పిన దానిని మరలఁ జెప్పుట చర్విత చర్వణమగును. వృథాగ్రంథము పెద్దదగును. కావున నిదివఱకుఁ జెప్పనివి చెప్పెదను.

కామాతిరేకముచే భార్యాభర్త లొడలు తెలియక ప్రవర్తించిరేని కొన్ని యనర్థకములు కలుగుచున్నవి. అందొకటి చెప్పెదను. ఏస్త్రీ సంభోగకాలమున బురుషునివలె వర్తించునో యా స్త్రీకిఁ బుట్టుకొడుకు నపుంసకుఁడగును. అంతియ కాక వాఁడు స్త్రీతో సమానమైన చేష్టలు ఆకారముగలవాఁడగును. ఇట్టి కొడుకు తన తల్లిదండ్రు లేనాఁడో గుట్టుగ జేసిన యకార్యమును రట్టుచేయుచున్నాఁడు. ఆ విధముగఁ బురుషునివలె సంభోగకాలమున వర్తించు స్త్రీకిఁ గన్యకపుట్టెనా యది పురుష చేష్టలుకలదై మఱియొకస్త్రీతోఁ బురుషునివలె సంభోగమున వర్తించునది యగును. కావున బురుషులు ప్రార్థించినను వివేకముగల స్త్రీలట్టి పురుషాయిత కార్యమున కంగీకరింపరాదు.

సంభోగమునందుఁ బ్రవర్తించు భార్యాభర్త లెట్టి యాహారమును భుజించువారుగను నెట్టి యాచారము చేష్టలు గలవారుగను నుందురో యట్టియాహారము నాచారము చేష్టలు గల పుత్రుఁడు జనించును. గావున తెలివిగల స్త్రీ పురుషులు సాత్త్వికాహారము భుజించుచు సదాచారసంపన్నులై మంచి నడవడిగలవారై యుండవలెను.

వాయువు మొదలగు దోషములు అతిశయించుట చేతను, గర్భిణిగానుండు కాలమున స్త్రీకి నిష్టమగు పదార్థములు నొసంగకుండుటచేతను, తల్లిదండ్రులు నాస్తికులో నాస్తికప్రాయులో యగుటచేతను, పూర్వజన్మమునఁ జేసిన పాపము వలనను, గర్భము వికారము చెంది కుబ్జత్వము (మరుగుజ్జు) ఊచచేతులు, కుంటితనము, మూఁగతనము, ముక్కుతో మాటలాడుట యిట్టి లక్షణములుగల శిశువు జనించును.

సంభోగకాలమందు స్త్రీ చాంచల్యముగలదిగ నుండిన వెఱ్ఱితనము, మౌనముగ నుండిన మూఁగతనము, కన్నులు మూసికొని యుండిన గ్రుడ్డితనము, నిద్రమత్తున నుండినఁ జెవిటితనము, కనుబొమలు విఱిచికొనియుండిన గొడ్డుపోతుతనము గల శిశువు జనించును. నిలుచుండి పలుమాఱు నీరుత్రాగుచుండిన నపుంసకత్వము, ఉష్ణపదార్థము భుజించు చుండిన వంకరచేతులు వంకరకాళ్ళు గల శిశువు జనించును.

పూర్వజన్మమున సాధువుల నిందించినవాఁడు మూగయగును. అసత్యపు సాక్ష్యము చెప్పినవాఁడు పగిలిన పెదవి గలవాఁడగును. గోవును జంపినవాడు గాండ్లవాని యెద్దైయిపుట్టును, పరులద్రవ్యము తీసికొని మరల నియ్యనివాడు కుక్కయగును. నిర్దోషురాలగు భార్యను వదలినవాఁడు దేశదిమ్మరుగను, చుఱుకురోగము కలవాడుగను నగును స్త్రీ హత్య, జీవహత్య చేసిన మాదిగవాడగును. కన్యతో సంగమించిన గ్రుడ్డివాడగును. కపటపు వ్యవహారములు చేసిన నపుంసకుడగును. జాతివైరము కలవాఁడు అధఃపాతియగును. భర్తచేయు దానమునకు నడ్డము చెప్పునది కుక్కగానో తిత్తిరిపక్షిగానో యగును. భర్తకంటె ముందు భుజించునది తన మలమును దానుదిను నివదవాదులపక్షి యగును. పతినిజంపునది బాలవిధవ యగును. పతిని బాధించునది విధవయగును. కుత్సితబుద్ధిగలది బంధువుల వదలి తిరుగునది యగును.

దేహపరిశ్రమను చేయని స్త్రీలకు వివిధ రోగములు వచ్చును. ఆహారము పుష్టిగానుండి దేహమున రక్తము మితిమించి యుండినను, దేహము దుర్బలముగా నున్నను ముట్టుకుట్టువ్యాధులు తప్పక వచ్చును.

మలమూత్రములు విడువక బిగించుటచేతను, కావలసినన్ని నీళ్ళు త్రాగక పోవుటచేతను. అజీర్ణవ్యాధి చేతను ముట్టుకుట్టుకలుగును. ప్రసవకాలమందుగాని యావల వెంటనే కాని ముట్టయి యుండునపుడుగాని విశేషము గాలి మంచులోఁబండుకొనుట, కడుపు ఱొమ్ము గ్రుద్దుకొనుట, కొట్టుకొనుట, ముట్టుకుట్టుట, విశేషము

గాటగు మందులు, పదార్థములు తినుట, అమిత సంభోగము,ప్రసవకాలమున గాయములు,బాలెంతగానున్న ప్పుడు విశేషకాలము నిలఁబడుట, నడుచుట, ఎగురులాడుట వీనివలన గర్భకోశము చెడును.

పెద్ద కుటుంబము భారము వహించు వారికిని,ప్రసవించిన తరువాత నల్పకాలమున నేలేచి తిరుగువారి కిని,గుడ్డలు బిఱ్ఱుగగట్టుకొనువారికిని,తటాలున విశేషభారమెత్తినను,మూత్రముబిగించినను,దేహము దుర్బలము గా నున్నను,గర్భకోశమునకు స్థానభ్రంశము కలుగును.దీనివలన ముట్టుకుట్టు లోనగు వ్యాధులు జనించును.

==== స్త్రీ ది న చ ర్య ====

సూర్యోదయమునకు గంట గంటన్నరముందు స్త్రీ భర్త కంటె ముందు నిద్రలేవవలయును.కాలుసేతులు కడిగికొని దంతధావనము చేసికొని భగవంతుని నామము జపించుచు లేక పాటలు పాడుచు గృహకృత్యములు నిర్వర్తింపఁ బోవలయును.తుదకు నేడుమార్లమున హరి హరి యని బఠింపవలయును.తమ యిష్టదేవత పేరైన స్మరింపవలయును.వాకిటి పని యింటిలోని పని యూడ్చుట మొదలైనవి తానే చేయవలసియుండినఁ జేయవలయు ను.చేయువారుండిన జేయింపవలెను. శుక్రవారము,మంగళవారము యిల్లు అలికింపవలెను.అమవాస్యయందును నలికింప వలయును.స్త్రీ లుదయానంతరము స్నానము జేయవలయును స్నానము జేయునపుడు మంత్రములు చెప్పుకోరాదు.స్నానానంతరము ముఖమునఁ గుంకుమ ధరింపవలయును.తరువాతఁ బాకాదికార్యములకు యత్నింపవలయును.పూజాపాత్రములు శుద్ధిచేయవలెను.ఇంటిలోఁ బిల్లవాండ్రుండిన వారిని స్నానము చేయించి నొసట వారి వారి మతాచార్యప్రకారము పుండ్రముల నిడి వేఱువేఱు భగవంతుని నమస్కరింపజేయవలెను.తాను భగవంతునిపై మనస్సు నిలిపి ఈ బిడ్డలు నీబిడ్డలు స్వామీ ! సర్వదా రక్షింపుము.రాత్రి యొడలెఱుఁగక మేము పడియుండినపు డెట్లు రక్షించి తికో యిప్పుడునట్లు రక్షింపుము.మాకందఱకుఁ దల్లివి తండ్రివి దాతవు త్రాతవు నీవేయని త్రికరణశుద్ధిగ నమస్కారము లాచరింపవలయును.ఉదయమునే యత్తమామలకు దల్లిదండ్రులకు భర్తకు నమస్కరించి వారి యాశీర్వాదమును బొందవలయును.ఈకాలమునవారు సిగ్గువిడిచినకార్యము లెన్నియైన జేయుదురు గాని యిట చేయ సిగ్గుపడుదురు.కాల మట్టిస్థితికి వచ్చినది కూరగాయలు తఱుగునపుడు వంట పదార్థములు శోధించునపుడు పాకములను జూచునపుడు వడ్డించునపుడు మాటలాడరాదు.ఎంగిలితుంపర పడును.కూరగాయలు తఱుగునపుడు వంట పదార్థములు వంటకిచ్చునపుడును పురుగులు లేకుండఁ జూడవల యును.బియ్యము పప్పు లోనైనవి నాలుగుమార్లు కడుగవలయును.బియ్యము లోనైన వానిలో రాలు మంటిపెళ్ళలు ఇసుక వెండ్రుకలు గోళ్ళు లేకుండఁ జూడవలయును.వాస్తవముగ నిఱుపేదలుగ నుండు బిచ్చగాండ్రకు కుంటి గ్రుడ్డివారలకు బిచ్చము వేయవలయును.సాయంకాలమందును నొకటి రెండు బిచ్చములైన నన్నము వేయవలయును.ఈ యధికారము స్త్రీలదే. భర్తవలదని చెప్పిన వేయవలదు.వంటకును,త్రాగుటకును,కాలుసేతులు కడుగుకొనుటకు నుపయోగించి నీళ్ళను మూఁడుమార్లు వడియఁగట్టవలయును.వడియగట్టు వస్త్రమును బ్రతిదిన ము శుద్ధము చేయుచుండవలయును.దానియందు గవాక్షములు (కిటికీ) లుండరాదు.ఒడియఁగట్టి కాఁగానే దానిని బులిమి యెండలో నాఱవేయవలయును.ఈ నీటిని కాకులు,కుక్కలు,పశువులు త్రాఁగని చల్లనిచోట నుంచవలయును.వేఁడినీళ్ళయినను జక్కఁగఁ గాచి చల్లారఁపోయుట మంచిది.వేఁడి నీళ్ళు త్రాగుటకుఁ గొన్నిచోటు ల మేలే.వంటజేయునపుడు మేనిచెమట తుడుచుకొన వేఱువస్త్ర ముంచుకొనవలయును.చేతితోఁ జెమటను దాఁకినయెడలఁ జేతులుకడుగుకొనియే మఱి వంటపదార్థమును దాఁకవలయును.తూర్పుముఖమై కాని యుత్త రముఖమైకాని పాకము జేయవలయును.కుండలలో వండువారు నెలకు మీఁద నా కుండలను వర్జించి క్రొత్త కుండల వాడుకొనవలయును.వంటకగ్నిహోత్రమును నితరుల యింటినుండి తేరాదు.అట్టు తెచ్చివండి రేని యాయన్నాదులతో దేవకార్యములు చేసిన యెడల దానిలో సగము ఫలము నిప్పునిచ్చినవారికిఁ బోవును.వంట ప్రొయ్యి చక్కఁగ మండునట్లు చూడవలయును.పొగచూరునట్లు జేయరాదు.అట్లని పెద్దమంట వేయరాదు.వంట కార్యము తధేకధ్యానముతోఁ జేయవలయును.చేయి యొకకార్యము మనస్సొకకార్యము చేయుచుండరాదు.ప్రొయ్యి మీది పదార్థములను కట్టుకొన్న చీరకొంగుతో దింపరాదు.వంటచేయునపుడు ఒడ్డాణము పెట్టుకొనరాదు.వడ్డిం చునపుడు ముత్తైదువులు రైక లేక యుండరాదు.మోదుగు,మారేడు,రావి,ఎఱ్ఱకాంచనము,తాండ్ర,తాటి,ఉమ్మెత్త, పారిజాతము,కరక,ముండ్లచెట్లు ఆముదము,బూరుగు,కానుగు,విరిగి,దిరిసెన,నూగు,జిల్లేడు,విషవృక్షములు,పొగ రాఁజునవి,చెడుకంపుకొట్టునవియగు చెట్ల కట్టెలను వర్జించవలయును.చింతకట్టెల పొగ కన్నులకుఁ గీడుచేయును మాఁడిన పదార్థము రాక్షసులకుఁ బ్రీతి.ఉడుకనివి రౌద్రము.చక్కఁగ నుడికినవి దైవము.కారణములేక పాయసము, మధురాన్నము,దధ్యోదనము,నూవులపొంగలి చేయరాదు.వడ్డనకుముందు భోజనశాల యూడ్వవలయును.ఎక్కువ పదార్థములు పాత్రములు వానివాని స్థానమున నుంచి యూడ్చిగాని కడిగిగాని పాకశాల శుద్ధము చేయవలయును వంట కాఁగానే కాలుసేతులు కడగికొని వేఱువస్త్రము ధరింపవలయును.దేవునింట యథాశక్తి నేతితోఁగాని,నూ నెతోఁగాని దీపము వెలిగింపవలయును.దేవగృహమందు నాముదముతో దీపము పెట్టరాదు.మగవారికి దేవతా

ర్చనకుఁ గావలసినవన్ని తీసి యియ్యవలయును. స్త్రీలెట్టివారైనను సువాసినులైనను విధవలైనను సాలగ్రామములఁ దాఁకరాదు. అభిషేకింపరాదు. సువాసినులైనను విధవలైనను ప్రతిదినము తులసిపూజ మానరాదు. ఇది యవశ్యము చేయవలసిన కార్యము. దీనియం దెక్కువ మహిమ గలదు. కావున శ్రద్ధతోఁ జేసిన నంతమేలు గలదు. తులసీవృక్షము సాక్షాల్లక్ష్మియవతారము, పూర్వపుఁ బుణ్యస్త్రీలు తులసి నారాధించియే యిష్టసిద్ధులు వడసిరి. అదిదేవతావృక్షము. దానియందు లక్ష్మి వసించుచుండును. ప్రతిదినము తులసీతీర్థము తీసికొనువారికి దేహపీడ యుండదు. యోగులాహారము దొరుకనప్పుడు పిడికెఁడు తులసీదళములఁ నీళ్ళు ద్రావుదురు. దీనివలన దేహదారుఢ్యము తగ్గదు. ప్రకృతి శాస్త్రజ్ఞులు తులసీవృక్షమును గుఱించి యిట్లువ్రాసిరి. తొలసియాకులు పాము విషమునకు విరోధి, పాము కఱిచినవాఁడు వెంటనే తులసిదళముల భుజించిన విషము సారించును. తులసిచెట్లున్న చోట వ్యాధిని గలిగించు పురుగులుబ్రతుకవు. వాని మీఁది గాలి విషక్రిములను హరించుటయేగాక వాయువును నిర్మలముగఁ జేయును. తొలసిచెట్ల నడుమ బూడ్వఁబడిన యొకశవ మాఱు నెలల వఱకునుఁ గ్రుళ్ళకయుండెనట. దీనివలన నే తులసియం దెంత సారముండునది తెలియవచ్చును. ప్రతి గృహమునఁ దులసివృక్షమును బెంపవలయును. అతిధి నభ్యాగతిని నాదరింపవలయును. భోజనస్థలము శుద్ధిచేసి యాకులువేయవలయును. ఒంటిచేతితో నన్నముగాని శాకపాకాదులు గాని వడ్డింపరాదు. పక్వములైన సాధకములు పాలు మొదలైనవి గరిఁ టెలతో వడ్డింపవలయును. తైలపక్వములను అపక్వములనుఁ జేతితో వడ్డింపవచ్చును. ప్రత్యక్షలవణము. వడ్డింపరాదు. కావున నన్నాదులలోఁ గలిపి గరిఁటెతో వడ్డింపవలయును. ప్రతిపదార్థము రెండవసారి కావలయు నేమో యడుగవలయును. అనఁగా నోటిమాటలతోగాదు. పదార్థము తెచ్చి చేతఁబట్టుకొని విస్తరియొద్దకు వచ్చి యడుగవలయును. కాలదుష్టము. అశ్రయదుష్టము, జాతిదుష్టము. నిమిత్తదుష్టము, క్రియాదుష్టము, సంసర్గదుష్టము, భావదుష్టము నగు పదార్థములు భుజింపరాదు.

కాలదుష్టమనఁగా జలిదియన్నము లోనైనవి. జాతిదుష్టమనఁగా ఎఱ్ఱగడ్డ తెల్లగడ్డలోనైనవి. ఇట్టి పదార్థములు బలమిచ్చునవియైనను సత్త్వగుణమును జెఱుచునది కావున భుజింపరాదు. ఆశ్రయదుష్ట మనఁగా కందుపాత్రలోని టెంకాయనీళ్ళు, రాగిపాత్రలోనితేనె, యినుపపాత్రలోని నీళ్ళులోనైనవి. నిమిత్తదుష్టమనఁగా ముట్టుతకు వడ్డింపగా మిగిలినది. కాలుతగిలినది, ఒకరుదాటినది, ప్రీతిలేక పెట్టినదిలోనైనవి క్రియాదుష్టములనఁగా మాఁడినవి. ఉడుకనివి, ముట్టుక వండినవి లోనైనవి. సంసర్గదుష్టములనఁగాఁ బురుగులు, వెండ్రుకలు, గోళ్ళు కలిసిన యన్నము, ఉప్పుతో, జేరినపాలు, నెయ్యి, సీసపుఁబాత్రములోని పాలు పంక్తిలో నొకరి కొకవిధముగ మఱియొకరికి నొకవిధముగఁ వడ్డింపరాదు. భోజనముకాఁగానే భర్తనుపచరించి తాంబూల మియ్యవలయును. భోజనము చేయునప్పుడు కాళ్ళు చాఁచుకొనరాదు. నవ్వరాదు. ఏడువరాదు. విశేషముగ మాటలాడరాదు. ఇతర స్త్రీ పురుషుల దోషములెంచరాదు. అన్నమును దూషింపరాదు. స్త్రీలు భర్తయుచ్ఛిష్టము భుజింపవచ్చును. అందఱకు భోజనమైన పిమ్మట నింటఁ బనులుచేయు దాసికలకు నన్నము పెట్టవలయును. లేదా యంట్లలోనే యన్నము వేయవచ్చును. ఉత్తపాత్రములు వేయరాదు.

భోజనానంతరము దేహమునకు గాసి తగులకుండపనులు చేయవలయును. మధ్యాహ్నమున నమ్మలక్కలితరుల యింటిపురాణములతోఁ గాలక్షపము చేయరాదు. మనుష్యులముందొకమాట వెనుక నొకమాట చెప్పరాదు. కలహము వచ్చు పలుకులు పలుకరాదు. అప్పులుజేసి మరలనిచ్చుటకు మఱచి పోరాదు. సాయంకాలము కాఁగానే యింటను దేవునింటను దీపము పెట్టి భర్తకు బిడ్డలకుఁ దక్కినవారికి మేలు కలుగవలయునని దేవుని ప్రార్థింపవలయును గాని కొందఱవలె ఆయన ముందు పోవలెనని కోరరాదు.

రాత్రివంటయందు ఉసిరిక, నూగులు కలియరాదు. రాత్రులందుఁ బథ్యముగ లఘువగ భుజింపవలయును. గృహకార్యములు నిర్వర్తించి యలంకరించుకొని శయనగృహమునకుఁబోవలయును. ముట్టుదాఁచునది, కడుపుదించుకొనునది, సవతికిగడుపుపోవ విషముపెట్టినది భ్రూణఘ్ని యనఁబడును. సమ్మానము, అవమానము, గృహచ్ఛిద్రము, ధనము, వయస్సు, అకార్యము, పెనిమిటియందలి దోషము, మైథునము యివి మఱియొకరితోఁ జెప్పరాదు. సాధారణముగా స్త్రీ ఉదయము మొదలు రాత్రివఱకుఁ జేయవలసిన పను లివి. ఇందుఁ జెప్పఁ బడకున్నను కుమారీహితచర్యయందును రుక్మాంగద చరిత్రము సావిత్రీచరిత్రము లోనగువానియందుఁ జెప్పఁబడిన వానిని గూడ స్త్రీలు గమనింపవలయును.

పతి శుశ్రూషము వంట మొదలయినవి భగవత్కైంకర్యబుద్ధిచేఁ జేయవలయును. ప్రత్యక్షదైవమగు పతిని విడిచి స్త్రీ వేఱుదైవతమును సేవించినఁ బ్రయోజనములేదు వ్యర్థము. అట్టిది పతివ్రతకాదు. పతినే భగవంతుఁడని సేవించునది యుభయలోక సుఖమును గాంచును. సర్వకాల సర్వావస్థలందును సర్వవిధములఁబతిని సేవించునది దేవసేవజేయుకుండినను దోషములేదు. పెనిమిటిని తృప్తిపఱుచుట తన చేతిలోని కార్యము అది జేయలేనిది యెందో యుండు భగవంతుని నెన్నియో జన్మములెత్తి యాగాదివిద్యలు సాధించి తపస్సు జేసినవారికిని లభ్య

పడనివాని నేమి తృప్తిపఱుపగలదు ? తన యుదరము నిమిత్తమై జేసికొను పాకాదుల వలనఁ బాపము వచ్చును.కావున వానిని భగవంతునికి నివేదించుటకే యను నుద్దేశముతోఁ జేయవలయును.దైవప్రార్థనము తన పెనిమిటి యాయన వంశము బాగుండవలయునని జేయవలయును బిచ్చమెత్తువారివలె నాకుఁజీరలిమ్మొసొమ్ము లిమ్మని దేవునియాచింపరాదు.స్త్రీ పతివ్రత,పతిప్రాణ, పతిమనస్క,పతిబంధువు,పతిధన,పతిమిత్ర,పతిప్రియ,పతిదేవత, సహధర్మచారిణియై యుండవలయును దేహము మనస్సు పరిశుద్ధముగ నుంచుకొనవలయును.ముఖముసర్వదా ప్రసన్నమై యుండవలయును గాని చిటచిట మటమటలాడుచుఁ గనుబొమలు ముడిపెట్టుకొని పలుకరించిన వారిని గఱవఁబోవుచుండరాదు.ప్రియముగ మాటలాడుచుండవలయును.పరుషవాక్యము లాడరాదు.పరుషవాక్యము బలిగోరునని సామెత.మన మేదైన జెడుమాట చెప్పితిమా యావేళకు సరిగా తథాస్తు దేవతలు తథాస్తు అనిరా యా కార్యము తప్పక జరుగును.కావున నవ్వులకైన నెవ్వరు కీ డాడరాదు ఇల్లాలు ధనము ధాన్యము చక్కఁగ రక్షింపవలయును.రెండుచేతులఁ దలబరికికొనరాదు.

మగఁడు తనచేతికి ధనమిచ్చినంత మాత్రమున గర్వింపరాదు.ఆయనకుఁ దెలియకుండ వెచ్చపెట్టరాదు. వాఁడు తలగొఱిగించుకొనవలయుననిన నింకను నెలయైనఁగాలేదే,యప్పుడే యేల మంగలవానికి దండుగ పెట్టుట యనరాదు.మగఁడు తనయందుఁ బ్రీతిచే నిచ్చుచున్నాఁడని యెంచి వినయ విధేయతలు గలిగియుండ వలయునుగాని వాఁడు విధవనాగ్నుయై తనకు దాసుఁడయ్యెనని తలంపరాదు.పెత్తనముజేయు నిల్లాలింటిలోని తక్కినవారిపై నధికారము చేయరాదు.పుత్రవాత్సల్యముతోను సోదరభావముతోను నాదరింపవలయును.చేయుటకుఁ బరిచారకు లుండినను గృహిణి సకల గృహకార్యము లందు నిపుణురాలైయుండవలయును.దంభము,మోహము,మదము,అసూయ,క్రోధము,అహంకారము కలదై యుండరాదు.దయము నోర్పు మిక్కుటముగఁ గలదై యుండవలయును.ఇంద్రియజయముగలదై యుండవలెను.స్థిరబుద్ధి దృఢభక్తి దృఢవ్రతయై యుండవలెను.పెద్దల యందు గౌరవము బీదలయం దనురాగము గలదై యుండవలెను.సిగ్గుబడియముగలదై మెల్లగ నడవవలెను.అసత్యము కలహము సోమరితనము తంటాలమారితనము కారాదు.పిసినిగొట్టు,ఇల్లనారాయణమ్మ.వదరుఁబోతు, ఆచారహీనురాలునై యుండరాదు.సహవాసము చేయరానివారితో సావాసము చేయరాదు.దేహము వస్త్రముచే మఱుఁగు పఱుచుకొని యుండవలెను.ఉత్సవాదులందు గుంపులోఁ జొరఁబడిపోరాదు.పతికిముందు భుజింపరాదు.ఏకాంతమునదప్ప మగనియెదుటఁగూర్చుండరాదు.స్త్రీలబొమ్ములు,మగవారిపిఱుదులు నేల దగులరాదు. మగని యనుమతిలేక యేదియు నెవ్వరి కియ్యను రాదు.భర్తను వంచింపరాదు.పతి చెప్పిన కార్యము చేయవలెను గాని యేదారి యనిన కాఁదారిఁ యనరాదు.దానము ఉపవాసము భర్త యనుజ్ఞలేక చేయరాదు.భర్త యే పదార్థము భుజింపడో యాపదార్థము తాను భుజింపరాదు.పతిబుద్ధిలేనివాఁడై తినరాని వస్తువులనుదినిన దానును దినవలెనని నియమము లేదు.మగని దుష్కార్యములను మంచిమాటలతోఁ దెలిపి సవరించుట పతివ్రతలకు లక్షణము మగని సంతోషముగను మగని దుఃఖము తన దుఃఖముగను భార్య యెంచవలెను.మగని సంతోషపెట్టుటే తనకు బరమార్థముగ నెంచవలెను.ఇచ్చకములచేతను నచ్చిక బుచ్చిక మాటలచేతను సంతోషపెట్టి దాని వలన బ్రతిఫల మపేక్షింపరాదు.మగఁడు కోపించినఁ దాను బదులు కోపింపరాదు.మంచి మాటలచేతఁ బ్రసన్నునిఁ జేయవలెను.మూర్ఖుఁ డగునేని తాను మౌనము వహింపవలయును.ప్రీతిపూర్వక నమస్కారములచేతను,కౌఁగిలింతలచేతను,ముద్దిడుటచెతను,వినయపుమాటలచేతను సమాధాన పఱుపవలయును.మనయందు దోషము లేదుగదా మనమేల లొంగవలయునని బిగించుకొనరాదు.పొలయలుక పడుకటింటిలో నేకాంతకేళి నున్నప్పుడు పానకములో మిరియాలు పొడవలె రుచికరముగ నుండును గాని తక్కినవేళల గారము తిన్నచోట వేడినీళ్ళు త్రాగినట్లగును.నిష్ఠురములచేతను బిగింపులచుతను దేహములు దూరమగునట్లు చేసితిరా మగని ప్రీతియందును మీరు దూరమగుదురనియు వల్లభ,ప్రియ,మహిళ యను పేర్లకు నర్హురాండ్రుగాక భార్య,దార,ప్రతీపదర్శిని,వామ యను పేర్లకు యోగ్యురాం డ్రగుదురనియు నెఱుఁగుఁడు పతి తన్నవమానించినను ఆక్రోశపు మాటలు ఎదిరించి పలుకుటలు,ఏడ్చుచుండుటలు కారాదు. భర్త యెదుటి కెప్పుడును జిఱునవ్వుతోఁ గూడిన ప్రసన్న ముఖముతోనే పోవలయును.భర్త కనఁబఱుచు ప్రియము తనకై తెచ్చిన పదార్థమల్పమైనను దానితో విశేషము సంతోషింపవలెనుగాని 'యింతే మహాభాగ్య' మని నిరుత్సాహ వాక్యములు పలుకరాదు.తీర్థములకు క్షేత్రములకు ఉత్సవములకు బతితోఁ గూడనే పొవలెనుగాని తానుమాత్రము పోరాదు.విధిలేకవచ్చినతప్ప నితరులయిండ్లకుఁ బోరాదు.పుట్టినయింట విశేషకార్యమైననే భర్త తోడఁ బోవలెను.ఒకవేళ నొంటరిగఁ బోయినను గార్యము కాఁగానే రావలయును గాని దీర్ఘకాలమక్కడనేయుండరాదు.నిష్కారణముగఁ బుట్టిమింట దీర్ఘముండునది చెడుత్రోవఁ దిరుగునది యని సందేహించుట తప్పుగాదు.ధనము తీసికొని తన్నిచ్చి వివాహము చేసిన తల్లిదండ్రుల యింటి కడప నాగవల్లి యయిన మఱుసటినాటినుండి వధువు త్రొక్కరాదు.వచ్చిమాంసమును విక్రయించు బోయలకు వారికి భేదమేమి? కన్యను విక్రయించువారు పంక్తి భోజనము కర్హులుగారు.మెఱమెచ్చుల కేకార్యమును జేయవలదు.ఇచ్చికము

లాడువారికి నింటిపదార్థములు తేరకీయవలదు. బాలయైనను యువతియైనను వృద్ధయైనను స్వతంత్రించి వర్తింప రాదు. తండ్రిస్వాధీనమందో, భర్త స్వాధీనమందో, పుత్రుని స్వాధీనమందో, వీరెవ్వరు లేనియెడల బంధువుల స్వాధీనమందో యుండవలయును. ఈ కాలములో దిక్కులేని వారిని బంధువులు పోషింతురనుమాట నమ్మరాదు. ధన ముండిన నెవ్వరైనఁ జేరదీయుదురు. అది లేనివారి నెవ్వరు పలుకరింపరు. స్వతంత్ర్యముగ జీవించుచుండినను తనకుమాటసాహాయ్యముగనైన బురుషు లున్నారని లోక మెఱుఁగ వర్తింపవలెను. లేనియెడల దుర్జనులు కీడుకావింతురు. భర్తయూర లేనపుడు సొగసులు చేసికొనరాదు. తల దువ్వుకొనరాదు. కురుమాపుచీర కట్టవలెను. గంధము పుష్పము, తాంబూలము వర్జించవలెను. ఆతఁడు మరల సుఖముగ నిల్లుచేర దైవప్రార్థనము చేయుచుండవలెను. భర్త యింట లేనపుడు తల్లియొద్దకుఁగాని యత్తయొద్దకుఁగాని వారు లేనపుడు దుశ్చారిత్రలుగాని స్త్రీ లింటరున్న వారియొద్దకుఁగాని పండుకొనుము. ఎవరు లేనపుడు బని చేయునది తార్చునది కాదేని దాసిని తోడుగ పండుకొన రమ్మని దానినొకచోటఁ బండుకొనుమని చెప్పి నీవు వేఱొకగదిలో తులుపు గడియవైచికొని పండుకొనుము. భర్త, యన్నదమ్ములు, కొడుకులు, తండ్రి తప్ప మఱి యెవరైనఁ బూలుగాని పండ్లుగాని మధుర పదార్థములుగాని తెచ్చియిచ్చినఁ దీసికొనవలదు. కేవల బంధువులై రేని క్రింద నుంచుమని చెప్పి యావలఁ దీసికొనుము. పరాయి వారైనచో వలదని పంపివేయుము. పరాయివారిట్టివి పంపిరేని వారు చెడుబుద్ధితోఁ బంపిరని నిశ్చయించుకొనుము ఒక్కసారి తీసికొనినను నీ కపవాదము తప్పదు. పరపురుషులతో నొంటిగను, దొడ్డివాకిటను, సమీపమున నిలఁబడియు మాటలాడరాదు. కుమారీ హితచర్యయందుఁ జెప్పిన దుష్టస్త్రీలక్షణముల మానుఁడు.

బిడ్డలారా ! మీఁద జెప్పిన గుణములు గల సతి యీ కాలమున నుండెనేని యామె ముఖమును ప్రొద్దున దర్శించిన యెడల వారి పాపములు పోవును. ఇట్టి పుణ్యస్త్రీ లందందుండుటవలననే యింకనుదేశము కొంతవరకైన సుభిక్షముగా నున్నది. మీకుఁజేయ నసాధ్యమైనవి నేను జెప్పలేదు. ఇవి యసాధ్యములైనయెడలఁ బూర్వస్త్రీలుమాత్ర మెట్లుచేయఁగలిగిరి ? చేయ మనసున్నచో నసాధ్యమేదియు లేదు.

బిడ్డలారా ! యిదివఱకుఁ జెప్పినదయైనను మరల నొకసారి యొకమాట చెప్పెదను దీనిని మీరు ముఖ్యముగ మనస్సున నుంచుకొనవలయును. ఆ ప్రకారము నడుచుకోవలయును. ఏ కాలమందును నేమఱవలదు. పతి హితచర్యయందు భార్యాభర్తృధర్మము జెప్పితిని. దానిని మరల మీరొకసారి చదువుఁడు. దానిని మీరు మనస్సున నిలుపుఁడు భార్యాభర్తలను నీజన్మమందు, మఱుజన్మమందును, మఱి యెన్నిజన్మములందైనను గట్టివేయునది ప్రేమయే తల్లిబిడ్డలు, అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు మొదలగువారి సంబంధము లన్నియు నీజన్మము నీదేహముతోఁ బోవునవి. భార్యాభర్త సంబంధ మట్టిదిగాదు. తక్కినవారి ప్రేమమునకు గారణము ఇచ్చుటో పుచ్చుకొనుటో యేదైన నుండును. భార్యాభర్త ప్రేమము జన్మాంతర లబ్ధము కులస్త్రీ ముందు మరణించెనా స్వర్గమునఁ దన పతి రాకకై యెదురుచూచుచుండును గాని తల్లిదండ్రులు, అన్నదమ్ములు లోనగు వారికై యెదురు చూడదు. సద్వృత్తిగల పురుషుఁడు నట్లే. కన్యపుట్టిన యింట నిల్లడయుంచిన సొమ్మువంటిది. కన్యకకు వివాహము కాఁగానే భారము తీఱినదని తల్లిదండ్రులు దలంతురు. తనకు గృహలక్ష్మి, అర్ధాంగలక్ష్మి, లాభమునకు క్షేమమునకునునై వచ్చినదని భర్త తలంచును. తల్లిదండ్రులకు భర్తకుఁగల భేదము తెలిసినదా ? ఇట్టిచోట స్త్రీ యెవరియందెక్కువ ప్రీతయుంచవలయును ? కొడుకందుమా ? కొడుకునాకొడుకు కోడలు వచ్చువఱకునను సామెత యసత్యముగాదు. పురుషుఁడు తల్లిదండ్రులయందుఁ గౌరవము భక్తి యుంచవలయును. భార్యయందుఁ బ్రీతియుంచవలయును. ఈకాలములో గొందఱు స్త్రీలు తన కొడుకునకుఁ బెండ్లిచేయవలయునని తహతహలాడుదురు. కొడలింటికి వచ్చినది మొదలు కోసికొాఱతవేయుచుందురు. కొడుకు తన పెండ్లముతో నవ్వినను దప్పే, మాటలాడినను దప్పే, ఏల ? భార్య రాకుండువఱకుఁ గొడుకు సర్వమునకు తన్నేకట్టుకొని పనులు చేయుచుండువాడు. భార్యవచ్చినపిమ్మట కొంతమనస్సు దానిపైఁ బోవును గదా. అది తనకొక కొఱఁతగా వానితల్లియెంచి యట్లే కొడుకు కోడలు నేక ప్రీతి నుండినఁ దన పుట్టి మునుఁగునని వారిలో వారికి భేదములు పుట్టించి గొడుకుఁ దనకు వశుఁడగా నుండఁజేయ యత్నించుచుండును. ఇట్టి ముండలు తమకొడుకును దామే కట్టుకొని యేల వానితోఁ గాపురము చేసి మరల మనుమలఁ గనరాదు ? కొడుకునకుఁ బెండ్లియని యొకటి యేల చేయవలయును ? ఇట్టి దుర్గుణములు గల తల్లిఁగల పురుషుఁడు పెండ్లామును వదలి తల్లినైన వివాహ మాడవలయును లేక తల్లినివదలి భార్యనైనను నేలవలయును. కొన్ని సంసారములలో నత్తముండెలు పడుపాట్లు చూచి యిట్లు వ్రాయవలసివచ్చెను. అత్తలు ఆఁడుబిడ్డలు నెట్టివారైనను మిమ్ము వారెంతకష్టపరచినను మీరు మాత్రము భర్తయందుఁ బ్రేమ తప్పరాదు. మిమ్ము బాధించువారి విషయమై భర్తతోఁ జెప్పియాయన మనస్సునకు వ్యాకులత కలిగింపరాదు. నిజము నిదానముగఁ దెలిసి యతఁడే చేయవలసినపని చేయును. తమకై మీరిన్ని కష్టములు నిష్కారణముగ సహించితిరిగదా యని మిమ్ము మఱింత ప్రేమతోఁజూచును తొలుతొలుతవారి మాటలు విని మిమ్ము పెనిమిటులు బాధింపవచ్చును. సత్యము వెలువడువఱకు మీరదియు సహింపవలయును స్త్రీలకుఁగాని పురుషులకుఁగాని యోర్పే భూషణము. ఎన్ని

